ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము-సంఖ్య 48.

# సీతారామచరిత్రము.

(బాలకాండము)








మంత్రిప్రగడ సూర్యప్రకాశకవి.

# పీఠిక.

శ్రీమద్రామాయణచరిత్రమునను సరించి (క్రీ. శ. 1851-52) విరోధికృద్వత్సరమున నాలుగాశ్వాసములుగా రచించిన యీ సీతారామ చరితముయొక్క రచయిత, మంత్రిప్రెగడ సూర్యప్రకాశకవివరుఁడు పూర్వగోదావరీమండలాంతర్గతములగు కాకినాడకును బిఠాపురమునకును నడుమనుండు తిమ్మాపురమను గ్రామమున (క్రీ. శ. 1808) విభవ సంవత్సరమునందుఁ బుట్టెను. అతఁ డాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు; హరితసగోత్రుఁడు; ఆపస్తంబసూత్రుఁడు; శరభరాజామాత్యునకును సీతాంబకును బుత్త్రుఁడు; విస్సాప్రెగడ జోగిరాజునకును వెల్లాంబకును దౌహిత్రుఁడు. హరిశతకమును రచించిన కామరాజును, బరకుటుంబమునకు దత్తుఁడయిన సుబ్బారాయఁడు నాతని తనయులు. ఆయన మొదటఁ గందర్ప సీతారామశాస్త్రియొద్దను బిదప దేవులపల్లి తమ్మయసూరి యొద్దను బిమ్మట వాడపల్లి పద్మనాభాచార్యునియొద్దను విద్యనేర్చి పండితకవియయి, ముప్పదివత్సరముల వయస్సున విశాఖపట్టణమండలాంతర్గతమగు మాడుగులు సంస్థానమునందుఁ బ్రవేశించి శ్రీకృష్ణభూపతి దేవమహారాజుగారి యాస్థానకవియయి సకలభాగ్యభోగములను బొంది నిజకాలమును గడపెను.

అతఁడు పారిజాతాపహరణకథను విజయవిలాసకథను గలిపి (క్రీ. శ. 1863) దుందుభివత్సరఫాల్గునమాసమున రెండాశ్వాసములుగల

కృష్ణార్జునచరిత్రమను ద్వ్యర్థిప్రబంధమును రచించెను. అప్పొత్తమును 1908వ వత్సరమునందు బి. ఏ. కును, 1914వ వత్సరమునందు ఎమ్. ఏ. కును బాఠ్యపుస్తకముగాఁ జెన్నపురవిశ్వవిద్యాలయము నిర్ణయించెను. మఱియు నతఁడు (క్రీ. శ. 1869) శుక్లవత్సరచైత్రమాసమున భీమలింగ శతకమును రచించి తన యిఱువదిమైదవయేఁట (1873 సం॥ మేనెల తే 11 దీ) శ్రీముఖవత్సర వైశాఖ శు ౧౪ భానువాసరమునందు స్ఫోటకవ్యాధివలన నిజతనువును త్యజించెను.

అతని కవిత్వము ధారాశుద్ధిగలిగి నిర్దుష్టమై యొప్పెడిని.

జయపురము ౧-౪-౪౧. } ఇట్లు, శ్రీ వి క్ర మ దే వ వ ర్మ.

# విజ్ఞప్తి

ఈ గ్రంథము మంత్రిప్రగడ సూర్యప్రకాశకవిచే శ్రీమద్రామాయణము ననుసరించి రచింపఁబడినది. దీని మాతృకను బ్రకటనార్థము మాకు దయతోనొసఁగిన శ్రీ శ్రీ శ్రీ జయపురాధీశ్వరులగు శ్రీ విక్రమదేవవర్మగారికి మా కృతజ్ఞతాభివందనములు. శ్రీ వారు గ్రంథకర్తయందలి యభిమానముచే నీగ్రంథమున కొకచిన్నపీఠికయుఁ గఠినపదముల పట్టికనుగూడ వ్రాసి మాకొసఁగియున్నారు. వీరిదివఱలో నీకవిచే రచింపఁబడిన కృష్ణార్జునచరిత్ర మను ద్వ్యర్థికావ్యమునకుఁ డీకను వ్రాసి ప్రకటించియుండిరి.

కవి జీవితాది విషయములను గూర్చి విపులముగ వ్రాసి మాకొసఁగిన శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యస్థాన పండితులగు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారికి మే మెంతయుఁ గృతజ్ఞులము.

ఈ గ్రంథ మతివిస్తృతమగుటచే సంపుటములుగఁ బ్రకటింప నెంచి యందలి బాలకాండమును బ్రథమసంపుటముగఁ బ్రకటించితిమి. దీనిని బాఠకులు సాదరముగఁ బఠించి యానందింతురుగాక.

ఇట్లు,

ఆంధ్ర సాహిత్య పరిషత్కార్యదర్శులు.

# కవి జీవితము.

సీతారామచరిత్రమను నీమహాకావ్యమును రచియించిన మంత్రి ప్రెగడ సూర్యప్రకాశకవి కడచిన శతాబ్దమున విలసిల్లిన కళింగాంధ్ర కవులలో మిక్కిలి ప్రసిద్ధుఁడు. ఈతఁడార్వేలనియోగిశాఖకుఁ జెందిన బ్రాహ్మణుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. హరితసగోత్రుఁడు. శరభరాజునకు సీతమ్మకును బుత్త్రుఁడు. ఈసీతారామచరిత్రమునుండియు నీతని కృత్యంతరమగు కృష్ణార్జునచరిత్రమునుండియు నీతనివంశ మిట్లు తెలియుచున్నది.

హరితసగోత్రము.

శరభరాజు

వేంకయ (జోగమ్మ) — రామయ్య

శరభరాజు (సీతమ్మ)

సూర్యప్రకాశకవి, (గ్రంథకర్త.)

సూర్యప్రకాశకవి మాతృవంశమువారు విస్సాప్రెగడవారు. ప్రకాశకవి మామయు మేనమామయునగు కామరాజకవి ప్రసిద్ధుఁడగు నాంధ్రకవి. ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక (18 సం. 2. సంచిక) యందుఁ బ్రకటింపఁబడిన "జరీజుపద్యము" లీకామరాజకృతములె. మఱియు రామచ్ఛాయభాషకుఁ బద్యములువ్రాసి చిత్రకల్పనలఁ గావించిన దీ కామరాజకవియే. * ఈతనిఁగూర్చి ప్రత్యేకముగఁ దెలుపుదును.

---

* ఈపద్యములను గూర్చియు, చిత్రకల్పనను గూర్చియు, శ్రీ రాయప్రోలు రామభద్రప్రసాదరావువారు ఆంధ్రపత్రిక నల సంవత్సరాదిసంచిక పుట 278 లో వ్రాసిన విషయము చూడదగు.

సూర్యప్రకాశకవి కామరాజకవి నిట్లు తనసీతారామచరిత్రమునఁ బ్రశంసించియున్నాఁడు.

సీ. ఏమహాత్ముసితాత యీశ్వరారాధన
ప్రముదితస్వాంతుండు బసవరాజు
ఏగుణాథికులతండ్రి హిమశైల
కైలాససురుచిరసత్కీర్తి జోగిరాజు
ఏసుధీమణియన్న భాసురాత్మజ్ఞాన
పటుమనీషాశాలి బసవరాజు
ఏధన్యుసూనుం డనేకబాంధవజన
స్తుత్యసద్గుణవార్ధి జోగిరాజు
అట్టి విస్సాప్రెగడ సత్కులాంబురాశి
సోము సుకవిత్వధారాభిరాము నాకు
మేనమామయు మామయై మెఱయువాని
నధిపకృతసఖ్యుఁ గామరాజాఖ్యుఁదలఁతు. (1-21)

సూర్యప్రకాశకవి క్రీ.శ. 1808 వ సంవత్సరమున గోదావరీమండలమునఁ గాకినాడ పీఠికాపురములకు నడుమనున్న తిమ్మాపురమను గ్రామమున జన్మించెను. ఈతఁడు తనబాల్యమునఁ దొలుత కంచుప్ప సీతారామశాస్త్రి యొద్దను నావెనుక దేవులపల్లి తమ్మయసూరియొద్దను నాపై వాడపల్లి యనంతపద్మనాభాచార్యులయొద్దను విద్యాభ్యాసముఁ గావించెను. ప్రకాశకవి పితృమాతృవంశములవారు విద్వత్కవులగుటచే నీతనికి సహజముగఁ గవితాధార యలవడినది. కేవలాంధ్రకవిత్వమేకాక పై పండితత్రయమునకు శుశ్రూషఁగావించి ప్రకాశకవి సంస్కృతకవిత్వమును, నుభయభాషాపాండిత్యమును సంపాదించెను.

పై గురుత్రయమును ప్రకాశకవి సీతారామచరిత్రముననను నీతని కృత్యంతరమగు [illegible] మనను [illegible] ప్రశంసించియున్నాఁడు.

కందర్ప సీతారామశాస్త్రి

శా. సారోదారగభీరవాగ్జితసురాచార్యున్ సుధాహారసీ
హారక్షీరశతారపారదమరాళాంచద్యశో రాజితు
న్గౌరీనాథపదాబ్జచింతకు లసత్కందర్పవంశాంబుధీ
ట్తారాపాలుని మద్గురుం దలఁతు సీతారామవిద్వన్మణిన్.
(సీతారామచరిత్రము 1-11)

శా. సీతారామపదారవిందయుగళీసేవాపరుం డాత్మవి
ద్యాతస్వీవశవర్తిమానసుఁడు కందర్పాన్వయాంభోజఖ
ద్యోతుం డాశ్రితశిష్యవత్సలుఁడు సద్యోవాసుఁడౌ మద్గురున్
సీతారామసుధీమణిం దలఁతు సత్కీర్తిప్రభావాన్వితున్.
(కృష్ణార్జునచరిత్రము. 1-9)

దేవులపల్లి తమ్మయసూరి.

ఉ. పావనవంశజాతనరపాలసభాంతరపూజ్యపూర్ణ వి
ద్యావినయాది సద్గుణవితానవిరాజితభూరికీర్తిఁ బ
ద్మావరపాదభక్తిరతు మద్గురుశేఖరు నీశ్వరోపమున్
దేవులపల్లి తమ్మయసుధీమణిఁ గొల్తు నభీష్టసిద్ధికిన్.
(సీతారామచరిత్రము. 1-12)

చ. దివిజగురుప్రసిద్ధమతి దేవులపల్లికులాబ్ధిచంద్రు మా
నవపతివర్గపూజ్యు సుజనప్రియపూతచరిత్రు నిందిరా
ధవపదపద్మభక్తిరతు దానవవైరిపురీనివాసు స
త్యవిజనవంద్యు మద్గురునిఁ దమ్మయసూరివరున్ భజించెదన్.
(కృష్ణార్జునచరిత్రము. 1-10)

వాడపల్లి అనంతపద్మనాభాచార్యుఁడు.

ఉ. మానుగ సన్నుతింతు బుధమాన్యచరిత్రుని మద్గురూత్తమున్
మానితవేదశాస్త్రపథమార్గఘనున్ సుగుణాభిరాము వై

ఘూనసవస్యు విష్ణుపదకంజరతాత్ము వికుంఠమందిరా
సీనుని వాడపల్లికులసింధుసుధాంశు ననంతదీక్షితున్.

(సీతారామచరిత్రము 1-13)

శా. ఆచారాన్విత వాడపల్లికులపారావారతారాధిపున్
మోచాంచత్ఫలమాధురీవిలసితామోఘార్థయుక్సాహితీ
వాచానిర్జితనిర్జరాధిపగురున్ వైఖానసున్ పద్మనా
భాచార్యున్ బ్రణుతింతు మాధవపదాయత్తాత్ము నస్మద్గురున్.

(కృష్ణార్జునచరిత్రము)

ఈ గురుత్రయమున దేవులపల్లి తమ్మయసూరి, శ్రీ పీఠికాపుర సంస్థానవిద్వత్కవులై జగత్ప్రసిద్ధిఁగాంచిన శ్రీ దేవులపల్లి వారివంశము లోనివారు. శతలేఖనీపద్యచాతురీధురీణులును, సరసకవితాధురంధరులును శ్రీ రావు గంగాధరరామరాయమహారాజేంద్రు నాస్థానవిద్వాంసులును, నగు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రులవారు తమ మహేంద్రవిజయమున నీ తమ్మయసూరిగారి నిట్లు ప్రశంసించియున్నారు.

సీ. సంతతాంతేవాసి చింతితవిద్యాస
మృద్ధిక్రియాహయగ్రీవమూర్తి
దినదినశ్రీరామదేవసేవాభినం
దిత మనస్సరణాంజనేయమూర్తి
నిత్యసూనృతభాషణాత్యంతతాత్పర్య
సాంద్రవర్తనహరిశ్చంద్రమూర్తి
సతతదీనావనవ్రతమహాకారుణ్య
విభవసంపూర్ణతావిష్ణుమూర్తి
అలరె హరిదుతకరిదంతవలయకాంత
మహితకలధౌతకటరాయమానకీర్తి
నయగుణస్ఫూర్తి తమ్మననామధేయ
సకలవందితమందారచక్రవర్తి

సూర్యప్రకాశకవి తనతండ్రిని నిట్లు ప్రస్తుతించియున్నాఁడు.

క. ప్రవిమలభక్తి నుతింతును
రవిసన్నిభతేజు శరభరాజసమాఖ్యున్
కవితామహత్త్వజితభా
రవికవి మజ్జనకు శరభరాజసమాఖ్యున్

శరభరాజుగా రిట్లు తనకుమారునిచే 'కవితామహత్త్వజితభారవి' యని పొగడ్త నొందినను నాతనిగ్రంథము లేవియుఁ గానఁబడుటలేదు. సూర్యప్రకాశకవి కనిష్ఠకుమారుఁడు కామరాజు హరిశతకమును రచియించి యున్నాఁడు. పైని వివరించిన యంశములనుబట్టిచూడ సూర్యప్రకాశ కవి తలిదండ్రులవంశములు రెండును కవి పండితవంశములే యని తేలు చున్నది.

సూర్యప్రకాశకవి విశాఖపట్టణమండలాంతర్గతమగు మాడుగుల సంస్థానాధీశ్వరుఁడును, భాషాపోషకుండును, పండితప్రభువునగు శ్రీకృష్ణ భూపతిమహారాజు నాస్థానకవియై తనజీవితకాలమంతయు సౌఖ్యముగ మాడుగులయందే గడపి, తే 11-5-1873 దిని కీర్తిశేషుఁడయ్యెను. కవి గారి కాశ్రయదాతయగు*శ్రీకృష్ణభూపతిమహారాజు క్రిందటిశతాబ్దమున నాంధ్రదేశమున విలసిల్లిన కీర్తిమూర్తులలో నొకరు. వీరు క్రీ. శ. 1813 లో జన్మించి 1835లో రాజ్యమునకు వచ్చి నలువదిసంవత్సరము లవిచ్ఛి న్నముగఁ బరిపాలించి తే 25-12-1875 దిని కీర్తిశేషులైరి. వీరికాలమున మాడుగులు విద్వత్సంస్థానమని ప్రఖ్యాతిఁజెందెను. శిష్టు కృష్ణమూర్తి శాస్త్రి, అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి మొదలగు విద్వత్కవు లీమహా రాజేంద్రునిచే సన్మానింపఁబడిరి. బులుసు పాపయ్యశాస్త్రి, ఇంద్రకంటి గోపాలశాస్త్రి మొదలగు శాస్త్రవిద్వాంసు లెందరేని యీతనిచే సంభావితులైరి. అడిదము బాలభాస్కరకవి, (అడిదము సూరకవి ప్ర

* శ్రీ శ్రీ శ్రీ సాహిత్యసామ్రాట్టు శ్రీ జయపురాధీశ్వర శ్రీ విక్రమదేవవర్మమహా రాజేంద్రు లాంధ్రసాహిత్యపరిషత్పత్రిక ద్వితీయసంపుటమున నీమహారాజేంద్రుని జీవిత చరిత్రమును లిఖించియున్నారు.

పౌత్రు(ండు) నిట్టలరాయలుకవి మొదలగు నాంధ్రకవు లీసంస్థానాంధ్ర కవులై ప్రకాశకవితోఁగూడఁ బ్రకాశించిరి. ఈవిద్వత్ప్రభువుపైఁ గవులు రచించినపద్యము లెన్నియేని కలవు. వానిలో నిట్టల రాయలుకవిగారి తారావళియు, అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారి కృష్ణభూపతిలలామ శతకమును మిక్కిలి ప్రసిద్ధికెక్కినవి. వీనిలో కృష్ణభూపతి తారావళిని శ్రీ జయపురాధీశ్వరులు శ్రీ విక్రమదేవవర్మమహారాజేంద్రులు కృష్ణ భూపతిమహారాజు జీవితమునందే ప్రకటించిరి. సుబ్రహ్మణ్యకవి కృత మగు శతకమును వారే నలువదేండ్లక్రిందట ముద్రించి ప్రకటించిరి. ఇందు నూఱు సీసపద్యములు గలవు. మత్స్యకులదీప దివ్యమన్మథ సహూప, పరమగుణధామ కృష్ణభూపతిలలామ యను మకుటము. పద్యములన్నియుఁ బ్రౌఢములై ప్రభువర్యుని భాషాపోషకత్వము పాం డితీసంభావనము ప్రస్తుతౌదార్యాదిగుణగణమునుఁ గీర్తించుచుఁ బ్రశస్త ములై వెలయుచున్నవి. ప్రకాశకవిగారు తమపూర్వజన్మపుణ్యవశంబున నీమహారాజేంద్రుని మన్ననఁ బాత్రులై యీక్రింది గ్రంథముల రచి యించిరి.

1. సీతారామచరిత్రము—ఇందు శ్రీరామాయణకథ యా ఱాశ్వాసముల యాంధ్రమహాకావ్యముగ వెలసినది. దీనినిఁ గవిగారు (క్రీ. శ. 1851-52 లో) విరోధికృద్వత్సరమున రచియించిరి. దీనినిఁ బ్రక టించుభాగ్య మాంధ్రసాహిత్యపరిషత్తువారి కబ్బుట ప్రశంసనీయము.

2. కృష్ణార్జునచరిత్రము—ద్వ్యర్థికావ్యము పారిజాతాపహరణము విజయవిలాసకథ లిందు మేళగింపఁబడినవి. ఇందు రెండాశ్వాసములు గలవు. కవిగారు దీనిని (క్రీ. శ. 1863 లో) దుందుభివత్సరమున రచించిరి ఇప్పటికి ముప్పదైదేండ్లక్రిందట నీగ్రంథము టీకతోఁ గూడ ముద్రింపఁ బడినది. శ్రీజయపురాధీశ్వరులు శ్రీవిక్రమదేవవర్మ మహారాజులే దీనికి టీక వ్రాసి ముద్రణభాగ్యము గలిగించిరి. ఈటీకవలన శ్రీ శ్రీ మహారా జేంద్రుల యుభయభాషాపాండిత్యము ప్రద్యోతమానమగుచున్నది.

3. భీమలింగశతకము—సూర్యప్రకాశకవిగారు తమ యభీష్టదైవ మగు భీమలింగస్వామిపేర నీశతకము శుక్లసంవత్సర (1869) చైత్రమాసమున రచియించిరి. ఇం దన్నియుఁ గందములు. "భీమలింగ కలుషవిభంగా" యనునది మకుటము. దీనిని శ్రీ జయపురాధీశ్వరులు శ్రీ విక్రమదేవవర్మమహారాజేంద్రులు క్రీ. శ. 1897 వ సంవత్సరమున ముద్రింపించి ప్రకటించిరి. ఇయ్యది భక్తిపరముగ నేగాక లోకనీతివిలసితమై యొప్పుచున్నది.

మచ్చునకు ముచ్చటఁగూర్చు మూఁడు పద్యము లుదాహరించెదను.

క. చెలువమరు రాజసభలను
బలుకని నరునోరు బుధులఁ బాసినయూరున్
కలిగియు లేనిదనంబును
కలకంధర భీమలింగ! కలుషవిభంగా!

క. కాయలు లేనిమహీజము
కోయిల లేనట్టి వనము గుడిలేని పురం
బాయతమోదముఁ జేయవు
క్ష్మాయజహార! భీమలింగ! కలుషవిభంగా!

క. జీతంబు లేనికొలువును
దాతలు లేనట్టి పురము తమిలేని కవల్
ఖ్యాతిని బొందకయుండును
కౌతుకయుత! భీమలింగ! కలుషవిభంగా!

'తత్పురుషబహువ్రీహుల సత్పురుషులు రామదాసశబ్దార్థమిలన్' ఇత్యాదిపద్యములఁ గవి తనసంస్కృతభాషాపాండిత్యము వెల్లడించినాఁడు.

సూర్యప్రకాశకవి శ్రీకృష్ణభూపతిమహారాజేంద్రుని పైనిఁజెప్పిన శ్లోకద్వయము  ...కవి తన

చాటుధారాచమత్కారసారమునఁ గూర్చి, వానిని వ్యాఖ్యానించి యున్నాఁడు. ఆశ్లోకముల మూఁటి నిం దుదాహరించుచున్నాఁడను.

శ్లో. చేతులే గ్గోతులే బాలే కాకులే వానముక్కలే
రుచిం పశ్యామి సుశ్యామే కచానాం తవ మంజులామ్.

(ఇందులఁ బూర్వపాదము తెలుఁగని భ్రమింపఁజేయును)

శ్లో. కృష్ణభూపతిసంకాశం కృష్ణభూపతిసన్నిభం
కృష్ణభూపతినీకాశం కృష్ణభూపతిసదృశః

శ్లో. విక్రమే ణార్జునముఖాః కృష్ణభూపాల తే హితాః
విక్రమేణార్జునముఖాః కృష్ణభూపాల తే హితాః

శ్రీ సాహిత్యసామ్రాట్టు శ్రీ శ్రీ శ్రీ జయపురాధీశ్వర, శ్రీ విక్రమదేవవర్మమహారాజేంద్రులు చిరకాలముక్రిందట ననఁగా క్రీ. శ. 1905 వ సంవత్సరమున టీకాసహితముగఁ బ్రకటించిన కృష్ణార్జునచరిత్ర పీఠిక నాకెంతయేని యుపయోగించినది. కావున నాకృతజ్ఞత నిందుమూలముగ శ్రీ ప్రభువువారికిఁ దెలుపుకొనుచున్నాఁడను. సూర్యప్రకాశకవి కృతములగు తక్కిన రెండుగ్రంథము లిప్పుడు లభ్యములు కాకుండుటచే వానినిఁ గూడ నీసీతారామచరిత్రములోఁ బునర్ముద్రణము గావించి, కవికీర్తినిఁ బ్రకాశింపఁజేయుదురుగావుతమని.

సప్రశ్రయముగ విన్నవించు,
విధేయుఁడు,

పీఠికాపురము,
24-4-1941.

నిడుదవోలు వేంకటరావు.
శ్రీ సూర్యరాయాంధ్రభాషానిఘంటుకార్యస్థానపండితుఁడు.

# సీతారామచరిత్రము.

## కథానుక్రమణిక.

### ప్రథమాశ్వాసము.



---

దారావాప్తులఁజేయఁగా వలయు మార్తాండాన్వయశ్రీలు పెం
పారన్ వీరలఁ గన్నవారలకు నేత్రానందము ల్పొందగాన్. ౩౭౦

చ. అని తలపోయుచుండ మనుజాధిపు నా రఘుపౌత్త్రుఁ గన్గొనన్
మనమునఁ గోరి మానిజనమాన్యుఁడు ధన్యుఁడు వన్యమూలకా
శనుఁ డుదితార్కతేజుఁ డురుసత్యవచోనిరతుండు గాధినం
దనుఁ డనఘప్రచారుఁడు ముదంబున వచ్చె నయోధ్య కంతటన్.

క. వచ్చిన విశ్వామిత్రుని
నచ్చుగ దౌవారికులు రయంబునఁ గని పెన్
మెచ్చుగ దశరథుతోడన్
జెచ్చెర నెఱిఁగింపఁ దనదు చిత్తం బలరన్. ౩౭౨

పంచచామరం.
పురోహితుల్ మహామతుల్ పురంబువారు గూడి రా
సరోజమిత్రధాముఁడైన సంయమీంద్రుపాలికిన్
ధరాతలేంద్రుఁ డేఁగి భక్తిఁ దత్పదాంబుజంబులన్
శిరంబు సోఁక మ్రొక్కి దండఁజేరి నిల్చియుండెనన్. ౩౭౩

క. పశుపతిసముఁడగు మునిపతి
దశరథుకుశలంబు నడుగఁ దడయక నాకుం
గుశలమని పల్కి నుతులన్
విశదములుగఁ జేయుచుండ వికసితముఖుఁడై. ౩౭౪

క. అందఱఁగని కౌశికుఁ డా
నందంబునఁ గుశల మడిగినం దమతమ మే
ళ్లందఱు దెలుపఁగ పఙ్క్తి
స్యందనుఁ డమ్మౌనిఁ దెచ్చె స్వగృహంబునకున్. ౩౭౫

వ. అనంతరం బా వసిష్ఠాదిమునిసహితంబుగా విశ్వామిత్రునిం బూజించి
దశరథుం డిట్లనియె. ౩౭౬.

సీ. నీరాక పరికింప నీరాకరాత్మజా
కరుణాకటాక్షప్రాప్తికారణంబు

నీదర్శనము సుధాపాదావలోకంబు
సరణి విలోచన సౌఖ్యదంబు
నీ ఘనాశీర్వచనౌఘవైభవ మెన్న
సకలార్థసంసిద్ధిసాధనంబు
నీ కృపామందాకినీఝరీసంప్రాప్తి
మోక్షలక్ష్మీప్రదాసక్షమంబు
గీ. గాన నీమహిమంబు నేనానికైన
భవునికైనను కమలసంభవునికైన
సన్నుతింపఁగ దరము గా దన్నమాకు
నెన్న వశ మౌనె గాధేయ హితవిధేయ. 3౬౭
ఉ. నన్నుఁ గృతార్థుఁజేయ గమనంబున నెంచి మునీంద్రచంద్ర! నీ
వి న్నగరీవరంబునకు నిప్పుడు వచ్చితివో మహాత్మ నీ
కు న్నను దాసుగాఁ దలఁచి కోరుము వాంఛిత మెద్దియైన నేఁ
గ్రన్ననఁ జేసెదన్ శ్రుతిసుఖంబుగ నానతి యీఁగ నావుడున్. 3౬౮
చ. జగతి మనుక్షితీశకులసంభవులందఱికన్న కీర్తులం
బొగడికఁ జెంది బంధుజనపూజ్యుఁడవై సుగుణంబు లెల్ల వా
సిగఁ గనుచున్ వసిష్ఠమునిశిష్యుఁడవై విలసిల్లుచున్న నీ
యగణితభాగ్యమెన్నఁగ జనాధిప యేరికినైన శక్యమే! 3౬౯
క. ని న్నొక యాచన సేయఁగ
ని న్నగరికి వచ్చినాఁడ నిక్ష్వాకుకులో
త్పన్నులు సరసతు లర్థుల
మన్నింతు రఁటంచు ముదము మదిఁ గడలుకొనన్. 3౭౦
క. యాచకు లేమడిగిన సం
కోచింపక యిత్తు రధికగుణు లంచుఁ దగన్
వాచాగోచరసత్యస
దాచారులు బల్కుచుందు రవనీస్థలిలోన్. 3౭౧

గీ. నీవు దర్శింపఁగా నవనీపకుఁడవు
నేను నిక్కంబు దలఁప వనీపకుఁడను
భిన్నవృత్తులమైన నభేదమయ్యెఁ
గాన నాకోర్కి సఫలంబు గాకయున్నె. 322

క. కరులు శతాంగములు లస
త్తురగములు సువర్ణములును దఁలలేని మణుల్
పురవరము లంబరంబులు
ధరణీశ్వర నిన్ను వేఁడఁ దగ నివ్వేళన్. 323

వ. నామనోరథం బెఱింగించెద నాకర్ణింపుము. 324

సీ. సవన మెప్పుడు నేను సయ్యాఁగఁ గావింపఁ
బూనుదు నంతలో భూరిబలులు
దానవు లిద్దఱు తడయక నేతెంచి
వేనలపైఁ గడువేడ్కతోడ
రక్తంబు జల్లియు రయమున నగ్నులఁ
బలలంబు వైచియు బహువిధముల
యాగవిఘ్న మొనర్తు రద్దురాత్ములుసేయు
పనులకే మిక్కిలి గినిసి చంపఁ

గీ. దలఁచి శాప మొసంగినఁ దపము తఱుఁగు
ననుచు చింతించి శాంతిఁ గైకొనుచు నుందు
ఖలుల వారల ఘోరసంగరములోన
హతులఁ గావించు నీ సుతుఁ డవనినాథ. 325

క. కావున నసురులఁ గూల్పఁగ
భూవర నీసుతుని బనుపు పురుషోత్తముఁడున్
పావనగుణుఁడగు రాముఁడు
దేవారులఁ దునుమఁ దగిన ధీరుం డరయన్. 326

క. రాముని గొనిపో నచ్చితి
భూమీవర నీసుతుండు పూతచరిత్రుం

డీమహితాత్ముని సత్వం
బే మనమున నెఱుఁగుదుర్ సమిద్ధగుణాఢ్యా. ౩౪౭

క. నావుడు కర్ణకఠోరము
లై వినఁబడు మౌనిమాట లాలింపుచు న
భ్భూవరుఁడు వగపుఁ జెందిన
భావంబునఁ గొంతసేపు పలుకకయుండెన్. ౩౪౮

వ. పిమ్మట నమ్మహీశ్వరుం డమ్మునీశ్వరున కిట్లనియె. ౩౪౯

ఉ. బాలుఁడు రాముఁ డెన్నఁగ నృపాలకయోగ్యమహాస్త్రశస్త్రముల్
చాల నెఱుంగఁ డాలముల చందములు న్వినియైన నేరఁడా
భీలతరాకృతుల్ దనుజవీరులు వారల సంగరంబునన్
గూలుపలేఁడు సుమ్ము మునికుంజర మాటలు వేయునేటికిన్. ౩౫౦

క. పంచదశాబ్దంబులు గల
వెంచిన రామునకు నిప్పు డీతని నీతోఁ
బాచిన నగరే పౌరులు
దంచితరుచికాకపక్షధరుఁ డౌనుగదా. ౩౫౧

గీ. ఆత్మజులఁ గాంచఁగోరి యే నహరహంబు
చింతనొందుచు నెట్టి విశేషముననొ
ముదిమి నఱువదివేలబ్దములకు సుతులఁ
గన్నవాఁడ సుమీ నన్నుఁ గన్నవాఁడ. ౩౫౨

క. నలుగురు తనయులలోపల
లలితాంగుఁడు సర్వభద్రలక్షణయుతుఁడున్
గులవర్ధనుండు రాముఁడు
జలజాక్షసమానుఁ బనుపఁ జాల నీవ్వనిన్. ౩౫౩

గీ. తల్లి చెంగట ముద్దు లందముగఁ జూపి
మెలఁగు రాముండు దనుజుల గెలువఁగలఁడె
రణమునం దటుగాన నీరాము బాలుఁ
గరుణఁ జూడుము నీ వట్టుగాకయున్న. ౩౫

క. రాముని జూడక యొక గడె
యేమఱి యుండంగ నోప నిటుగావున నా
రామునితో సేనలతో
నీ మఖసంరక్షసేయ నే నేతెంతున్. ౩౮౫

క. అన విని కౌశికుఁ డిట్లను
జనవర నీమదికి నింత సంశయ మేలా
విను నీ తనయాగ్రణికిన్
ఘనతరకల్యాణ మేను గానింతుఁ దగన్. ౩౮౬

క. కంటికి రెప్పవిధంబున
జంటగ నీ సుతునితోడఁ జరియింపుచు నీ
కంటెను లాలింపుచు ని
ష్కంటకముగఁ దలఁచు నావచన మజతనయా. ౩౮౭

క. దంటగు నీ రాముఁడు నా
వెంటం జరియింపుచుండ విధి విధులకు ము
క్కంటికి గెలువఁగ వశమే
ఘంటాపథములను బోలుఁ గద! నామాటల్. ౩౮౮

ఉ. రాముని సుప్రభావము ధరాతలవర్య! వసిష్ఠుఁ డీ ముని
గ్రామణి దానెఱుంగు బుధగణ్యచరిత్రుఁ డుదారకీర్తి సు
త్రామముఖామరావనవిధానసమర్థుఁడు నీ సుతుండు స
త్త్వామరసాప్తతేజుఁడు యథావిధి నెన్న మనుష్యమాత్రుఁడే! ౩౮౯

గీ. అసహాయంబుగల రాముఁ డసురవరుల
గెలువలేఁడని నీవు శంకిలుచు నుంట
యసమసాహసంబునను గాదె వసుమతీశ
గుణుల కెన్నఁగ వయసు కారణముగాదు. ౩౯౦

గీ. సకలలోకసమితి సన్నుతిసేయంగ
సకలలోకసమితి సంతతంబు

కరుణ నేలఁ దగిన ఘనుఁడు నీ తనయుండు
పరమపురుషుఁ డితఁడు భానుకులుఁడ! ౩౯౧

చ. అనవుడు కుంభినీపతి రయమ్మున నమ్మునిఁ గాంచి పల్కెనో
మునివర యన్నిశాచరుల మూఢుల వారలఁ బంపువాఁ డె వ
ద్దనుజుల శౌర్యసంపదవిధంబును వారి జయించు వైఖరిన్,
జనవున నానతీవలయు సంశయ మయ్యెడు నా మనంబునన్. ౩౯౨

వ. అనిన విశ్వామిత్రుం డిట్లనియె. ౩౯౩

క. మందరగిరిసమధైర్య! వి
నం దగు సంక్రందనాదినాక చరారుల్
సుందోపసుందు లను దితి
నందనులకు నందనుల్ కనద్భుజశౌర్యుల్. ౩౯౪

క. ఆ రాక్షసు లెన్నంగా
మారీచ సుబాహు లనఁగ మహి విఖ్యాతుల్
వారలు రావణదనుజ
ప్రేరితులై యధ్వరంబు పెం పడఁతురుగా. ౩౯౫

వ. అనిన విని పెల్లగుఁభయంబున మూర్ఛిల్లి యమ్మహీవల్లభుండు గొం
వడి కల్లనఁ దెలిసి యుల్లంబు తల్లడిల్ల నిట్లని వితర్కించె. ౩౯౬

క. అకటా యీ రాముఁడు ఘన
వికటాకారులగు దనుజ వీరులఁ దునుమన్
ప్రకటాస్త్రము లెఱుఁగఁడు మహా
నికటాక్షుంబైన రాదు నే నెటు సేతున్. ౩౯౭

క. శశ్వత్తపోబలంబున
నీశ్వరసముఁడైన యీ మునీశ్వరుఁ డెన్నం
విశ్వాపకారి గావున
విశ్వామిత్రాఖ్య జగతి విశ్రుతుఁ డయ్యెన్. ౩౯౮

ఆ. వె. మనుకులాహితాత్ముఁ డన మించి లోకవి
ఖ్యాతిఁగాంచె మున్ను ఘనముగాఁగ
మనుకులాహితాత్ముఁ డనఁదగి లోకవి
ఖ్యాతిఁగాంచు నిపుడు కౌశికుండు. 3౯౯

మ. అని చింతించి మునీంద్రుఁ గాంచి కడు నెయ్యంబార భూపాలుఁడో
మునినాథా! విను దానవుల్ ప్రథనభీముల్ వారి ఘోరాజిలోఁ
దునుమంజాలఁడు గా బిడౌజుఁడయినం దుష్టాత్ములన్ వారి బం
పినవాఁడా దశకంఠుఁ డాతని కథల్ భీతిప్రదంబుల్ గదా. ౪౦౦

ఉ. కావున వారి నేనెదుర్కఁగా మదిఁ గొంకెద నింక నా సుతుం
డా వరవిక్రమాధికుల నాజి వధింపఁగ నేరఁ డన్న మా
టీవ యెఱింగె దింత నిజ మెంచి సముంచిత సత్కృపామతిన్
గావుము నన్ను నా సుతులఁ గాతరశీలుర నీకుమ్రొక్కెదన్. ౪౦౧

క. నే రా వెఱతును నీతో
నా రాముని బంపవెఱతు నాయెడఁ గృపచే
నేరములెన్నక యేఁగు మ
పారతపోనుతచరిత్ర పరమపవిత్రా! ౪౦౨

క. అనవుఁడుఁ గనలుచుఁ గౌశిక
మ్మునిి కన్నుల విస్ఫులింగములు రాలంగా
ఘనకల్పాంతహుతాశను
ననువున మండిపడి పల్కె నాతని గనుచున్. ౪౦3

చ. అడిగిన దెద్దియైన వినయంబున నిచ్చెద నంచుఁ బల్కి నే
నడిగినవెన్కఁ గామితము వ్యర్థముఁజేసితి వైన నేమి యి
ప్పుడమిని నిన్నుఁబోలు నధిపుల్ గలరే యెరు లింతనుండి నీ
కొడుకుల మిత్రులన్ సతులఁగూడి సుఖింపుచునుండు నెమ్మితోన్.

క. ఘనకీర్తివి దాతవు పా
వనచరితుఁడ వధికసత్యవచనుఁడ వనుచున్

నినుఁ దలఁచి నాకు మతిలే
మిని వేఁడితి పోయివత్తు మిథ్యావచనా. ౪౦౯

క. అనిపల్కిన సాగరగిరి
వనపురఘనసరిదుపేతవసుమతి గంపం
బును జెందె సపుడు దివిజులు
మనమున భయ మంది రంత మనుజాధిపుతోన్. ౪౦౭

వ. సత్వరంబున సత్వగుణగరిష్ఠుండగు వసిష్ఠ మునీంద్రుం డిట్లనియె.

శా. కంటే సర్వధరాతలంబు మిగులం గంపించె భూపాల నీ
కంటెన్ ధర్మయశోఘనుండు దలఁపంగా లేఁడు నిక్కంబు ము
క్కంటిం బోలెడువాఁడు కౌశికుఁడు సత్కారుణ్యశీలుండు నా
కంటెన్ మేలొనగూర్చు వానిఁ గుపితుంగాఁ జేయుటల్ గూడునే.

క. సర్వాస్త్రశస్త్రముల నో
యుర్వీధవ యాతఁడెఱుఁగు నొప్పుగ నితనిన్
గీర్వాణు లెన్నఁజాలరు
సర్వజ్ఞుఁడు గాఁడె మదిని జర్చింపంగన్. ౪౦౯

చ. అతులతపోబలంబున సురారుల వేగ వధింప లేఁడె నీ
సుతునకు నీనెపంబునను శోభనముల్ సమకూర్పవచ్చె ని
య్యతివరుఁ డింత నిక్కువ మటంచుఁ దలంచి విసంశయుండవై
వితతనయంబునం బనుపు వేగమ నీ తనయున్నృపోత్తమా! ౪౧౦

గీ ధరణి పున్నాగసంజ్ఞను దానవారి
సమతఁ గన్నట్టి కుంభినీశ్వరుఁడ వయ్యు
నాశ్రితాళుల మన్నించి యనుదినంబు
ప్రమద మొసఁగవె యోరాజపంకజారి! ౪౧౧

గీ. ఆజి విజయ సమేతుండ వధిప నీవు
నిన్నుఁ బోలుచు సుగుణమ్ము లన్ని గాంచి
సొంపుఁ జెందుచు నుండు నీసూనుఁ డరయ
నాజి విజయసమేతుఁడై యమర వలదె. ౪౧౨

వ. అదియునుం గాక ౪౧౩

గీ. బొంకువలన మనుజపుణ్యంబు నశియించు
బొంకువలన సిరియు బుద్ధి వోవు
బొంకువానిఁ గనుచు బుధులు నిందింతురు
గాన బొంకు దగదు ఘనుల కెచట. ౪౧౪

గీ. మునిమనోరథంబు మున్న కూర్చెదనని
యతఁడు రాము ననుపు మన్న వెస్టఁ
బనుప ననుచుఁ బల్కఁ బాడియే నీ కది
గాన రాము ననుపు మౌనితోడ. ౪౧౫

క. అని బోధింప వసిష్ఠుని
ఘనతరకల్యాణసూచకములగుపలుకుల్
విని మనుజవరేణ్యుఁడు దన
తనయుని మునితోడ ననుపఁ దగ నూహించెన్. ౪౧౬

వ. అంత నర్ధరాకాంతుఁడు తద్వృత్తాంతం బంతయుఁ గులకాంతయగు కౌసల్యాకాంత కెఱింగింప నక్కుటిలకుంతల కొంతసేపు చింతాక్రాంతస్వాంతయైన, నేకాంతంబున శాంతవచనము లాడుచున్నంత. ౪౧౭

గీ. ధరణిఁ గతకంబు పంకిలోదకము నిర్మ
ల్లంబుఁ జేసినగతి సరసంబుగాఁగఁ
దనదు వచనాలి దారచిత్తంబు దీర్చ
సంతసంబునఁ బొంగి యజ్జనవిభుండు. ౪౧౮

వ. రామలక్ష్మణులం బిలిచి, వసిష్ఠాదిమునులవలనను, సకలభూసురోత్తములవలనను బుణ్యాహవాచనంబులు చదివించి, భద్ర వాద్యనిస్వనంబులు చెలంగ లసద్రూపయగు భార్యయుం దానును గుమారుల దీవించి, గాఢాలింగనపూర్వకంబుగా మస్తకాఘ్రాణంబు గావించి, విశ్వామిత్రుం గాంచి, 'గాధినందనా! యానందకరులగు నానందనులు నేఁటినుండి భవదధీనులు' అని పల్కి, యతని కరకమలంబునం దనూజకరసరోజంబు లునిచి, యప్పగింప నప్పుడు. ౪౧౯

క. పరిమళయుతమై మారుత
మరుదుఁగ వీచెన్ సుపర్వు లట సుమవృష్టిన్
గురిసిరి నిర్జరదుందుభి
దరరవములు వినఁగవచ్చె తెఱచుగ మింటన్. ౮౨౦

సీ. రామలక్ష్మణు లంత రయమున దశరథు
పాదాంబుజములకు భక్తి మ్రొక్కి
ఘనవసిష్ఠాదిసన్ముని జనంబులకును
మన మలరార నమస్కరించి
రమణీయమణిగణరాజితతపనీయ
భూషణధారణస్ఫూర్తిఁ దనరి
యతులకృపాణబాణాసనపాణులై
చరమాంగబద్ధనిషంగు లగుచు
గీ. కవచములఁ బూని బిరుదసంకలితు లగుచు
పౌరజనలోచనానందకారు లగుచు
గాధినందనమునితోడఁ గరము వేడ్క
ననుగమించిరి తన్మహావనము సేరు. ౮౨౧

క. చెన్నుగ మునితో నేనిక
గున్నలవలె నడుచు నృపతికొమరుల యందం
బెన్నఁగ వశమే తిన్నగఁ
బన్నగపతికైనఁ బద్మభవునకునైనన్. ౮౨౨

వ. ఇట్లు కౌశికానుచరులగు నా రాకుమారులు కశ్యపమునీంద్రనుపిటింది నడుచు నింద్రోపేంద్రులచందంబున సాంద్రతరతేజోవిశేషభాసితులై, చూచువారలకు నేత్రోత్సవము సేయుచు, సార్ధయోజనదూరం బఱగి, సరయూదక్షిణకూలంబునం బ్రవేశింప, విశ్వామిత్రుండు రామచంద్రునకిట్లనియెను. ౮౨3

క. ఆయతభుజ! విను ఘనవి
ద్యాయుగళము సత్త్వసకు నావిద్యలచే

శ్రీయును ధీయు నుపాయమ
మేయబలం బెపుడు నీకు మేలై యుండున్. ౨౨౭

గీ. ఆకలియు దూప యలయిక సోఁక కుండు
శౌర్యధైర్యగాంభీర్యాదిసద్గుణములు
నిలుచు మిక్కిలి నీయందుఁ నీతిభూతి
లోకములయందు నీసరి లేక యుండు. ౨౨౮

క. బల యతిబల యనఁగాఁ దగి
యిల సన్నుతిఁ గాంచినట్టి యీవిద్యలు నీ
వెలమిని గైకొనఁగా జల
ముల శుద్ధి వహించి రమ్ము మునిహితచరితా. ౨౨౯

వ. అనిన విని రామచంద్రుండు పవిత్రోదకంబులు వార్చి వచ్చినఁ, గౌశి
కమునీంద్రుఁ డవ్విద్యల నుపదేశించి మఱియు నిట్లనియె. ౨౨౨

శా. ఈవిద్యాయుగళంబు మార్గముల నీ వేతెంచుచో నాత్మలో
భావింపన్ దనుపుష్టిఁ గూర్చుఁ బ్రబలాపన్నాశముం జేయు న
ద్దేవారాతుల నాజిలోన భుజశక్తిం గూల్తు వో రాఘవా!
యేవేళన్ నిను రక్షసేయు నిఁక నీ కెవ్వారలుం దుల్యులే. ౨౨౮

క. నలినాసనుని తనూజలు
బలవతు లీవిద్య లనుచుఁ బరమమునీంద్రుం
డలరుచుఁ దెలిపిన రఘువరుఁ
డెలమిని దన యాత్మలోన నిటు లూహించెన్. ౨౨౯

గీ. ప్రబల యతిదత్త మీబలాతిబల లనఁగఁ
దనరు చున్నట్టి చారువిద్యాయుగంబు
"ప్రబలయతి ఖలు మా మిదం ద్వయ"మటంచు
నెంచి తత్పఠనంబున మించి యపుడు. ౨౩౦

వ. ఆమునివర్యునకు నమస్కరించి గురుసపర్య లొనరించి యున్నంత ౨౩౧

గీ. పద్మినీకాంతనోములపంట విరహి
చక్రవాకాభిలాషముల సంఘటించు

దంట చీఁకటిగములను గెంటు జాణ
తరణి పడమటిగుబ్బలిమఱువుఁ జేరె. ౪౩౨

క. జవమున గరు లల్లార్చుచు
దివిఁ బరువులు వెట్టి బారుదీర్చుచుఁ దమలోఁ
గువకువ గూయుచు ఖగముల
నివహంబులు గూళ్లు చేరె నెఱి నవ్వేళన్ ౪౩౩

సీ. అంధకారాత్యాహ్వయం బుచితం బన
హరువిధంబున స్వయంవ్యక్త మగుచు
ఘనతమోనామంబు గనుట యుక్త మనంగ
స్వార్థానుకరణి సుశ్యామ మగుచు
సర్వ మహా తిమిరాఖ్య యంచు వచింపఁగా
జలరాశిభాతి విస్తార మగుచుఁ
దగును తమిస్రాభిధానం బనఁ బ్రియామ
పగిది నిశాచర భయద మగుచు

గీ. సకల వస్తువితానంబులకును దనదు
రూప మొసఁగుచు జనదృష్టిరోధమగుచు
జారచోరాభిసారికాస్వాంతహృద్య
మగుచుఁ జీఁకటి జగ మెల్ల నాక్రమించె. ౪౩౪

చ. చలమునఁ దాల్చు నవ్యనిమిషత్వము మా కెనగాఁగ మీనులం
చలుకను వేల్పు లభ్రధుని నంబుచరంబులఁ బట్టి వైచు పె
న్వల యనఁగా నభంబు గనవచ్చె వలంబడి సాధ్వసంబునన్
జలనము నొందు బేశిసలచందమునం గనుపట్టెఁ దారకల్. ౪౩౫

వ. అనంతరంబ. ౪౩౬

క. రాజితకమలాహితపద
రాజీవవరుండు విబుధరాజినుతుండున్
గోజితకవివిలసద్ద్విజ
రాజుదయించెన్ గళాభిరాముం డగుచున్. ౪౩౭

గీ. విరహిజనముల బాధింప వెలివ ననుచుఁ
గంతుఁ డఖిల మెఱుంగ సభాంతరమున
వ్రేలఁ గట్టించినట్టి మేల్వెండిఘంట
నాఁగ సొబఁగొందె యామినీనాయకుండు. ౪౩౮

సీ. పగలు మరంద మింపుగ మాకు నొసఁగు రా
జీవముల్ ముకుళింపఁ జేసినట్టి
కడలిబిడ్డఁడు మమ్ముఁ గరుణఁ బోషింపఁడే
యటు గాక యున్న రాజనఁగ నతఁడు
వెలయునే గాన నిర్వేళ మరందాధి
కంబైన మధురామృతంబు మాకు
నిచ్చు నస్మహితాత్ముఁ డెన్నఁగా సారంగ
ధరుఁడు కావున మమ్ముఁ దాల్చు నింక

గీ. సజ్జసాంగత్య మెప్పటి కబ్బు ననుచు
మానుగా సుధ గ్రోలంగఁ బైని వ్రాలు
మధుపమాలబృంద మన చంద్రమండలమున
చారుతరలీల భవ్యలాంఛనము దనరె. ౪౩౯

గీ. పాండువేదండ డిండీరపుండరీక
కుండలీంద్రుల నిరసింపుచుండి ధరణి
మండలము వెండిగతి నొప్పుచుండఁ జేసి
పండు రేయెండ రోదసి నొప్పుచుండె. ౪౪౦

వ. ఆసమయంబున, ౪౪౧

సీ. ఒకమాఱు తగఁ దీర్ఘ నొప్పుగాఁ జంద్రికాం
కురములు లాంతురతచేఁ గ్రోలుచుండి
యొకతూరి తుహినాంశు నొద్ద కేఁగఁ దలంచి
బారులై దివి కొంతదూర మేఁగి
యొకపాలి తమచెంత నున్న కాంతలఁ గిచ్చఁ

దేటవెన్నెలకొనల్ దెచ్చి యిచ్చి
యొకసారె మాభాగ్యనికర మేమన వచ్చు
నంచు హెచ్చుగ మెచ్చుకొనుచు నుండి

గీ. కౌముదమునకుఁ బోలె మాకౌముదంబు
'కౌముదం కస్య న కరోతి' కౌముదీయు
మంచు నిజకాంతలను గౌఁగిలించుకొనుచు
మంచిగఁ జకోరముల్ విహరించుచుండె. ౪౪౨

వ. అట్టి రాత్రియందుఁ గౌశికదాశరథులు తృణకల్పితశయనంబుల నిద్రించుచుండ నిశాంతం బగుటయు. ౪౪౩

క. ప్రాగంగన దొడవుల నను
రాగంబునఁ బూనఁ దలఁచి రహిఁ దొలుత సిగన్
బాగుగ నునిచిన కెంపుల
రాగిడి యనఁ దూర్పునందు రవి యుదయించెన్. ౪౪౪

ఉ. కాంతుఁడు పాణిపంకజయుగంబునఁ బెన్ గిలిగింత వెట్టఁగా
సంతస మంది నవ్వగను జవ్వనికై వడి నూతనోదయ
ధ్వాంతవిరోధిభానుకలితభ్రమితవిస్ఫుటపుండరీక స
త్కాంతిసరోజినీరమవికస్వరవృత్తి నెసంగె నత్తఱిన్. ౪౪౫

వ. అంతకు మున్ను గాధేయమునిప్రబోధితులగు రామలక్ష్మణులు ప్రభాతకాలానుష్ఠానంబు లాచరించి, విశ్వామిత్రునకు నమస్కరించి కృతప్రయాణులై కొంతదూరం బఱిగి, భాగీరథిం గాంచి, యచ్చట సరయూతటంబున నొక్క పరమతపోవనంబుం గనుఁగొని, రామచంద్రుం డిప్పుణ్యాశ్రమం బెద్ది యని మునివర్యు నడిగిన నతం డిట్లనియె. ఇది కామాశ్రమం బిచ్చటఁ దొల్లి శంకరుం డుగ్రతపోనిష్ఠాగరిష్ఠుండై యుండఁ, గందర్పుండు దేవహితార్థంబుగా భవునకు భవానిం గూర్తునని యుల్లంబునం దలంచి, కుసుమశరంబు లతని పయిం బఱఁగింప ఫాలాక్షుండు కుపితుండై, తృతీయలోచనంబున

నతని నిరీక్షించిన, నతనియంగంబు భూతలంబునం బడుటం జేసి కా
ముం డనంగుండు నాఁ బరఁగె. నాటం గోలె నీదేశం బంగసంజ్ఞం
బ్రవర్తించె, నిచ్చట నాకు శిష్యులగు మునులున్న వార, లీయుభయ
సరిన్మధ్యంబు పుణ్యాలవాలంబును నివాసార్హంబునుఁ గావున నిచ్చట
స్నానసంధ్యాజపహోమాదులయిన యాహ్నికవిధానంబు లొనర్చి,
యీరాత్రి యిచ్చట నుండి, రే పిమ్మహానది నతిక్రమింత మనుచుండ
నంత, ౪౪౬

క. అచ్చటి మును లచ్చోటికి
వచ్చి మునీంద్రునకు భక్తి వందనములు దా
రచ్చుగఁ జేయుచు వినుతులు
మచ్చిక నొనరించి యంత మహితాకృతులన్. ౪౪౭

వ. రామలక్ష్మణులం గాంచి, యుచితసత్కారంబు లొనర్చి, వారల నిజా
శ్రమమునకుం గొనిపోయినఁ, గౌశికదాశరథులు విహితసాయంకా
లవిధానంబులు సల్పి, యారాత్రి యచ్చోట వసియింపఁ వేగిన మఱు
నాఁ డమ్మునులు జాహ్నవీతీరంబునకు వారిం దోడ్కొని వచ్చి, యోడ
నెక్కించి, మీరింక వేంచేయుం డనిన నట్లకాక యని మునివరుల
వీడ్కొని, ౪౪౮

గీ. తరణిసన్నిభ తేజు లత్తరణి నెక్కి
యమ్మహానది దాఁటుచో నవనిపాల
సుతులు మునిపతిఁ గాంచి యచ్చోట భూరి
రవము వినవచ్చు నిది యెట్టి రావ మనిన. ౪౪౯

సీ. కౌశికుం డిట్లను కైలాసభూధరం
బున నొక్క కాసారమును విరించి
మనమున నిర్మింప మానసం బనఁ దగి
ఘనతరవిఖ్యాతిఁ గాంచె నందు
వలన సంజాతమై వెడలు నీ సరయువు

సాకేతపురిచుట్టు సంచరించి
జాహ్నవితోఁ గూడఁ జనుదెంచె నిచటికిఁ
గాన గంగాసరయూనదులకు
గీ. సంగమం బయ్యె నిచటఁ దద్భంగసమితి
చెలఁగి యొండొంటిఁ దాఁకినఁ జిత్రముగను
బొడము ఘోషంబు లివి యని పొసగఁ జెప్పె
మఱియు వారలఁ బల్కె నమ్మౌనివరుఁడు. ౨౯౦

వ. ఇమ్మహానదుల దర్శనస్పర్శనంబులు మానవులకు భోగమోక్షప్రదంబు లగుం గావున భక్తిభావంబున నమస్కరించుం డనిన వినయంబున మ్రొక్కుచు నవ్వాహిని నతిక్రమించి, దక్షిణతీరంబునం బ్రవేశించి, తత్సమీపంబున సాల రసాల తాల హింతాల పాటల మధూక వేణు బదరామలక జంబూ జంబీర పన సాశ్వత్థ కపిత్థ నారికేళ వట ప్లక్ష ప్రముఖానేకానోకహావృతంబును, కంక గృధ్రి బక కాకాది ఖగనిస్వనాకీర్ణంబును, సింహశరభ శార్దూల సూకర శుండాల ఖడ్గ భల్లుకాదిమృగకులసంకులంబును, దుర్జనహృదయంబునుం బోలె దుర్గమంబును, అంధకారంబునుం బోలె దున్నిరీక్ష్యంబును నగు నొక్క మహారణ్యంబుఁ గనుఁగొని, రఘువరుండు మునివరున కిట్లనియె. ౨౯౧

క. మునివర దుర్గమ మీకా
నన మెద్ది యనంగ గాధినందనుఁ డా రా
ముని గుణయుతుని గనుంగొని
విను మని యిటు చెప్పఁ దొడఁగె విస్ఫుటఫణితిన్. ౨౯౨

క. గోత్రారి మున్ను కడిమిని
వృత్రాసురవిపులబాహువిక్రము దునుమన్
సుత్రాముని విమలంబగు
గాత్రలంబున బ్రహ్మమాహాత్మ్య [illegible] ౨౯౩

వ. అంత, ౧౫౪

గీ. సురలు మునులు వచ్చి శుద్ధోదకంబులు
దెచ్చి దివిజనాథు దేహ మెల్లఁ
గడిగి యతనిమేనఁ గదిసిన మలకరూ
శములు భూమి వైవ సరభసమున. ౧౫౫

సీ. అమరనాథుఁడు నిర్మలాంగుఁడై సూర్యుని
కైవడి తేజంబు గాంచి మున్ను
తనశరీరమునందుఁ దార్కొని యున్నట్టి
మలకరూశంబులు మహి వహింపఁ
గని విస్మయం బంది కరుణాసమేతుఁడై
మలయుక్తదేశంబు మలదమును గ
రూశయుతంబుఁ గరూశదేశంబును
గాఁగ సంజ్ఞలఁ జేసి ఘనత మీఱు

గీ. చూడ నీ రెండు దేశంబు లుండు గాత
ననుచుఁ బల్కినఁ దత్కాలమాదిగాఁగ
విమల మలదకరూశదేశములు భూరి
సంపదలఁ జెంది యుండె నుతింపఁబడుచు. ౧౫౬

వ. అట్లు కొంతకాలం బరిగిన, ౧౫౭

గీ. తాటక యనంగ నొక్కతె దనుజకాంత
కరిసహస్రబలాన్విత గలిగె భువిని
దానికొమరుండు మారీచదానవుండు
శౌర్యకంపితగీర్వాణసంచయుండు. ౧౫౮

వ. అద్దురాత్ముఁడిద్దేశంబులకు నాశంబు సేయం గోరి మార్గంబుల నిరోధించుచు, జనంబుల వధింపుచు, గోవృషభమహిషాదిచతుష్పదంబులం బట్టి హింసింపుచుఁ బెక్కుగతుల బాధింపుచుండ, నిష్పారంబులు నిర్మనుష్యంబు లగుట మహారణ్యంబై మార్గంబు గానరాకుండె,

నిచటికి గవ్యూతిమాత్రదూరంబునఁ దాటక యుండు, నచ్చోటికి
మన మరిగినపిమ్మట నక్కుటిలనిశాటిం దునిమి యజ్ఞపదంబుల నె
ప్పటియట్ల బహుజనధనధాన్యసంపన్నంబులం జేయు మిక్కార్యంబు
నీకుఁ దక్క నితరుల కసాధ్యం బని చెప్పిన రామచంద్రుండు విశ్వా
మిత్రున కిట్లనియె. ౪౯

క. తాటక యనుబోటికి నెటు
వాటిల్లె సహస్రమత్తవారణబల మో
హాటకగర్భసమాన వ
ఘాటులు పరికింప మిగుల దుర్బలులు గదా. ౫౦

వ అనిన మునివరుం డిట్లనియె. ౫౧

ఆ. వె. ధర సుకేతుఁడనఁగఁ దనరారు నొక యక్షుఁ
డతఁ డపత్యరహితుఁడై విరించిఁ
గురిఁచి తపముఁ జేసి కూఁతు దాటక నాఁగఁ
గరిసహస్రసత్త్వఁ గనె వరమున. ౫౨

వ. అనంతరంబ కొంతకాలంబునకు, ౫3

క. పొంమగ నత్తాటకయను
సుందరికిం బెండ్లిసేయఁ జూచి యతం డా
సందమున జంభసుతుఁడగు
సుందునకు నొసంగెఁ గూఁతు శోభనలీలన్. ౫౪

వ. అంత. ౫౫

సీ. సుందుఁడు తాటకయందు మారీచాఖ్య
నందనుఁ గని మృతిఁ జెంద నదియుఁ
గొమరుండు దానును గుంభసంభవమౌనిఁ
గని భ్రమింగ నూహించి కదియ నతఁడు
గనుఁగవచే నగ్నికణములు రాల్పుచుఁ
గడు కోపమున వారిఁ గలయఁ జూచి

రాక్షసకృత్యంబు రయమునఁ జేయంగఁ
గదిసిన వారలు గాన వీరు
రక్కసులు గం డటంచును వెక్కసమగు
శాప మొసఁగిన వారు నిశాచరులయి
చెలఁగి యిక్కాననమ్మున మెలఁగుచుందు
రర్కకులదీప ! భువనసమ్యక్ప్రతాప ! ౪౬౬

వ. కావున. ౪౬౭

చ. సకలజగద్ధితంబుగ నిశాచరి నాజి వధింపు రామ తా
టక ధరఁగూల్పఁ గల్గు పొగడందగుకీర్తి, మనంబులోఁ బొలం
తుక వధియింపఁ గూడ దతిదోష మటంచుఁ దలంపరాదు మున్
బ్రకటగుణాంచితుల్ కుటిలభామినులన్ దెగఁజూడఁ గానమే. ౪౬౮

గీ. కలన వీరుని గని ధైర్యకలన బల్మి
బెట్టుగాఁ జూపి మాయలఁ బెట్టునట్టి
దిట్ట యది యైన బ్రతుక లే దిట్టలమగు
నీపరాక్రమమున నవనీప రామ ! ౪౬౯

క. అనవుఁడు రఘువరుఁ డిట్లను
మునినాయకుఁ జూచి లోకములు ముద మందన్
ఘనశరముల నీతాటకఁ
దునుముదు సందియము లేదు దురితవిదూరా ! ౪౭౦

క. నీయుక్తి పంక్తిరథభూ
నాయకవచనంబుగతి వినందగు నాకున్
ధీయుత ! నీతో నే దై
తేయుల భువిఁ గూల్ప నేఁగుదెంచితిని గదా. ౪౭౧

చ. అనుచు రఘూద్వహుం డతిరయంబున సింజిని వింటఁ గూర్చి గ్ర
క్కున మొరయింప నవ్విపులఘోషము నల్దెసలందుఁ బర్వుచున్
మనుజసురాసురాదుల మనంబులఁ దల్లడ మందఁ జేసె న
వ్వననిధులుం గలంచె కులపర్వతముల్ వడఁకించె నంతటన్. ౪౭౨

క. ఆనాదము చెవిఁ బడఁగా
దానవి దా నినికి మదిని ధైర్యం బెంతేఁ
బూనుచుఁ గోపాన్వితయై
యానినదముఁ బట్టి చనఁగ నాత్మఁ దలంచెన్. ౪౭౩

వ. ఇట్లు దలంచి ౪౭౪

క. పదఘట్టనముల మేదిని
గదలఁగఁ బెంధూళి దిశలు గప్పఁగ వడి రా
నొదవిన గాలిని మబ్బులు
చెదరఁగఁ బఱతెంచె రాముచెంతకు నంతన్. ౪౭౫

సీ. అంజనభూధరం బన నల్పు మీఱుచు
నధికమౌ మేనితో నమరుదాని
బలుకొండగుహనాఁగఁ బొలుపారు చున్నట్టి
ఘన వివృతాస్యంబు గలుగు దాని
గండస్థలంబులదండ వ్రేలాడు క
పాలకుండలములఁ గ్రాలుదాని
శవకోటి దండగా సంధించి మొలచుట్టు
గట్టిగాఁ గట్టుకొన్నట్టి దాని
నస్థిమాలిక లఱుత వ్రేలాడుదాని
గొప్పమిడిగ్రుడ్లు గిరగిరఁ ద్రిప్పుదానిఁ
జెలఁగి దిక్కులు పగుల గర్జిల్లుదాని
తాటకిని గాంచి రవ్వేళ దాశరథులు. ౪౭౬

వ. అంత రామచంద్రుండు లక్ష్మణుం జూచి యిట్లనియె. ౪౭౭

గీ. అఖిలజనభీకరాకార మైనదాని
నధిక దుర్గంధయుత గాత్రమైనదాని
దానవిని దీనిఁ జూచినధరణిలోన
ఝ వణకుందురె యెటువంటి వీరులైన. ౪౭౮

క. వనిత యిది గాన మ్రిక్కిలి
కనికరమగు, దీనిఁ జంపఁగా రా దిఁక ము
క్షున జెవ్రులుఁ గోసి విడిచెద
దనుజాంగన కిదియ శిక్ష తమ్ముఁడ దలఁపన్. ౪౭౯
క. అని పల్కుచుండ నాలో
దనుజాంగన శేణువాదంబులు మింటన్
బనివడి పన్ని రజంబులు
మనుజేంద్రునిమీఁదఁ గురిసె మాయాశక్తిన్ ౪౮౦
వ. మఱియును. ౪౮౧
సీ. తాటక యొక ముహూర్తముదాఁకఁ దనమాయ
కతన నిశ్చేష్టులుగా నొనర్ప
నంత రాఘవుఁడు మాయాస్త్ర మేయుచు దాని
మాయ మాయింప నమ్మగువ వేగ
నురుశిలావర్షంబు గురియంగ సాయక
వృష్టిచే ధారుణీవిభులు శిలల
వాన మాన్పించి రవార్యుఁడై రాముండు
శరములచే దాని కరయుగంబు
గీ. ద్రునుమ బీరంబుచెడి మ్రోలఁ దొట్రుపడుచు
నార్పులిడుచుండఁ గనుఁగొని యమితసత్వ
శాలి లక్ష్మణుఁ డధిక శరాళి నసుర
కామినీకర్ణనాసికాగ్రములఁ ద్రుంచె. ౪౮౨
క. అంతటఁ దాటక గనలుచు
నంతర్ధానంబు నొంది యవ్వీరులపై
వింతగతి నుపలవర్షం
బెంతేఁ గురియంగఁ జొచ్చె నే పడరంగన్. ౪౮౩
వ. అప్పుడు కౌశికమునీంద్రుండు రామభద్రున కిట్లనియె. ౪౮౪

క. రామా! యీ దుశ్చారిణి
కామిని యని నీవు మదిని గరుణింపంగా
రామా! దానికి మనపై
సామిశిలావృష్టిఁ గురియసాగెను గంటే. ౪౮౫

సీ. కాన నధ్వరవిఘ్నకారిణి పాపసం
చారిణి మాయానుకారిణి యగు
నీదానవిని వేగ మేదినిఁ గూల్పు వ
ధింప రాదనుచుఁ దలంప రాదు
దయ చాలు నింక సంధ్యాకాల మబ్బిన
విపులమాయల నిది వెలయుచుండు
సంజల దనుజుల భంజింపఁగా రాదు
మంజుభాషణ బలభంజనునకు
గీ. విహిత మిప్పని యనుచు న వ్విధిసముండు
మునివరుఁడు చెల్ప రఘుపతి మోదమునను
వినుచుఁ దనపైని గర్జిల్లుచును గడంగు
తాటకను గాంచి పరిమార్పఁ దాఁ దలంచి. ౪౮౬

క. దివ్యాస్త్ర మొకటి గైకొని
క్రవ్యాదినిపైశరంబు గాడఁగ నేయన్
హవ్యభుజు లలరఁ దాటక
భవ్యమహీధరముభంగిఁ బడియె న్నేలన్. ౪౮౭

గీ. అట్లు తాటక ధరఁ గూల నధికముగను
చప్పుడొదవిన నద్రిశల్ సంచలించె
నంత గీర్వాణముఖ్యుఁడై బలాంతకుండు
సంతసంబున నచటికి సరగ వచ్చె. ౪౮౮

గీ. ప్రాణములఁ బాసి ఘోరరూపంబుతోడఁ
బుడమిఁ బడియున్న రకసిరొమ్మశలు చూచి

విస్మయము నొంది రాముని వినతిఁ జేసి
కౌశికుని గాంచి పల్కె నక్కౌశికుండు. ౪౮౯

క. ఈరాముఁ డఖిలజగదుప
కారంబులు సేయఁ జాలుఘనుఁడు ధరాభృ
ద్ధీరుఁడు పారావారగ
భీరుఁడు జగదేకపూజ్యవీరుం డెన్నన్. ౪౯౦

క. కావున నీ దుష్టమతిన్
వేవేగన్ దునిమి నీకు వేల్పులకును నా
కీవేళ సుఖముఁ జేసెను
భావింపఁగ రాముఁ బొగడ బ్రహ్మకు వశమే. ౪౯౧

గీ. భూపవందితు నితని సురోపకృతిని
జేసితేని ప్రతాపవిశేష మొప్ప
నుర్విఁ జేయు నితండు సురోపకృతిని
దులితవాగీశ ! యాశ్రితదురితనాశ ! ౪౯౨

వ. అది గావున నీవెఱుంగు నస్త్రశస్త్రంబు లన్నియు రామచంద్రునకు ననుగ్రహింపవలయు నని పల్కి, కౌశికదాశరథుల వీడ్కొని సురేంద్రుండు సపరివారుండై సురలోకంబున కరిగినపిమ్మట, నమ్మునీంద్రుండు రామభద్రునిం జేరఁ బిలిచి, సాదరంబుగా గాఢాలింగనంబుఁ జేసి, మస్తకాఘ్రాణంబు గావించి, సంధ్యాసమయం బయ్యెఁ గావున నీవింధ్యాచలారణ్యంబున నీరాత్రి వసియించి యెల్లి మదీయాశ్రమంబునకు "నేఁగుద మనిన, రామలక్ష్మణులు సంతుష్టాంతరంగులై యా నిశీథిని నచ్చోట వసింప వేగుటయుఁ బ్రభాతంబున నృపనందనుల మేలుకొలిపి, తత్కాలోచితవిధానంబు లాచరించి, విశ్వామిత్రుండు మందహాసభాసురాననుండై రామున కిట్లనియె. ౪౯౩

క. నీవరవిక్రమమునకును
దేవతలును సకలమునులు దేవేంద్రుండున్

భూవర సంతోసిల్లిరి
గావున నీకస్త్రశస్త్రగణ మే నిత్తున్. ౪౯౪

చ. అన వినయాన్వితుండయి రయంబునఁ బ్రాంజలియైన రామచం
ద్రుని గని గాధినందనుఁడు రూఢకృపామతితోడ నస్త్రముల్
ఘనతరశస్త్రముల్ క్రమముగా నొసఁగెన్ విధియుక్తవైఖరిన్
దనుజుల నెల్ల కయ్యముల దక్షతఁ ద్రుంచెద వంచుఁ బల్కుచున్.

గీ. అమ్మునీంద్రుండు బ్రహ్మాస్త్ర మాదిగాఁగఁ
గలుగు నస్త్రంబులును శస్త్రగణము నొసఁగఁ
గైకొనుచు రాముఁ డల దివాకరునిమాడ్కి
వెలుఁగుచుండెను దేజంబు విస్తరిల్ల. ౪౯౬

వ. ఇట్లు దేవాసురులకు దుర్లభంబులగు దివ్యాస్త్రశస్త్రంబులు వడసి, తత్ప్రయోగంబులు తత్ప్రభావంబులు తదుపసంహారంబులు కౌశికు వలన నెఱింగి యున్నయెడఁ నయ్యస్త్రంబులు మూర్తిమంతంబులై రఘువరుం గాంచి, దేవా! మీరెట్ల యానతిచ్చిన నట్ల మెలంగెదమనిన సంతోషించి, రాముండు వలయు నప్పు డరుగుదెం డనిన వల్లెయని ప్రాంజలులై యమ్మహాస్త్రంబు లంతర్ధానంబు నొందిన యనంతరంబ.

క. రాముఁడు కౌశికమునివరు
ధీమహితుం గని తపోనిధీ ! నీకరుణన్
గామితముఁ గంటి ఘనసం
గ్రామంబులఁ గూల్తు నసురగణముల నింకన్. ౪౯౮

వ. అని వినుతించి నమస్కరించి త్రోవ నరుగుచు, ముందల న్నొక పర్వతసమీపంబున రమ్యతపోవనంబుం జూచి, యిది యెవ్వరియాశ్రమం బని యడిగిన రామచంద్రునకు విశ్వామిత్రుం డిట్లనియె. ౪౯౯

క. ఇది సిద్ధాశ్రమ మనఁగా
విదితంబు జగంబులోన విష్ణుం డిచటన్
గదలక యనేకయుగములు
వదలక తప మాచరించె వామనుఁడై. ౫౦౦

సీ. ఆ జనార్దనుపాలి కరుదెంచి వేల్పులు
బలిదానవుఁడు సేయు బాధ లెల్ల
నెఱిఁగించి సన్నుతు లెంతయుఁ గావించి
మమ్ముఁ గటాక్షించి మనుపు మిపుడు
బలి యేలుచుండె నీ బ్రహ్మాండ మంతయు
వాని గర్వ మడంపవలయు నీవు
వామనమూర్తివై వలనుగా నాతని
నధ్వర కాలంబునందు భూమి
పత్త్రియము వేఁడి యీవిష్టపత్రయంబు
గొనుచు నాఖండలునకును గోర్కె మీఱ
నొసఁగవలె దేవ! యని తెల్పుచుండ నటకు
నేఁగుదెంచెను గశ్యపుఁ డింతితోడ. ౨౦౧

వ. వచ్చి కశ్యపమునీంద్రుం డమ్మహాత్ముని దేవతలచందంబునఁ బ్రార్థిం
చినఁ గరుణించి, పుండరీకాక్షుండు నీకుఁ బుత్రుండనై జన్మింతునని
వరంబిచ్చి, కశ్యపునివలన నదితిగర్భంబున వామనుండై పుట్టి, మఖ
సమయంబున నబ్బలీంద్రుని పదత్రయమాత్రధాత్రీతలంబు యాచించి,
తనవిక్రమంబున లోకత్రయం బాక్రమించి, యసురనాథుని రసాతలం
బున బాధించి, క్రమ్మఱని విశ్వపాలనాధికారంబు దేవేంద్రునకొసం
గె, దాన విష్ణుండు త్రివిక్రముండనం బరఁగె, మఱియు ననేక మహా
మును లిచ్చోటఁ దపస్సిద్ధులైరి, యీసిద్ధాశ్రమంబున నేనుం దపం
బు గావింపుచుండు నని పల్కుచుఁ గౌశికుండు రామలక్ష్మణసహితుం
డై తదాశ్రమంబు ప్రవేశించిన ౨౦౨

గీ. అచటిమునివరు లెదురుగా నరుగుదెంచి
గాధినందనుఁ బూజించి కరము వేడ్క
రవికులోద్భవులైన యారాఘవులకు
నతిథిసత్కారము లొనర్చి రభిరతిని. ౨౦3

వ. పరివేష్టించియున్న సమయంబున. ౧౦౪

సీ. వారణంబులతో నుదారమైత్రి యొనర్చి
తీరుగా మెలఁగు కంఠీరవములు
ధేనువర్గంబులపైని మక్కువఁ జూపి
జానొప్పు వ్యాఘ్రసంతానములును
లీలతో మూషకజాలంబులను గాంచి
లాలింపుచున్న బిడాలములును
తురగంబులను గూడి వరమోదమొప్పఁగాఁ
దిరుగుచున్నట్టి కాసరచయంబు
మఱియుఁ జెలువొందు జంతుసమాజములును
శుక పికాది విహంగమనికరములును
చారు పల్లవ ఫలయుక్తభూరుహములు
గలిగివెలయు తపోవనిఁ గనుచు నృపులు. ౧౦౫

గీ. రహిని దమలోన సహజవైరంబు విడచి
మెలఁగుచున్నవి యిచ్చోటిమృగము లెల్ల
కౌశికుతపోమహిమ మెన్నఁగా వశంబె
యనుచు నాశ్చర్యమందిరి యాత్మలందు. ౧౦౬

వ. అంత రఘువరుండు విశ్వామిత్రునకిట్లనియె. ౧౦౭

గీ. సవనదీక్షఁ బూను సయ్యన మౌనీంద్ర
సవనభుజులు చాల సంతసింప
సవనమునకు విఘ్నసంప్రాప్తి లేకుండ
నా శరాళిఁ గ్రుంతు నాసురాళి. ౧౦౮

క. అని తెల్పఁగ మునినాథుఁడు
ఘనసంతోషమునఁ బొంగి క్రన్నన దీక్షం
గనియుండె నట నభోమణి
కనకప్రభ లొప్ప నపరకంధిని గ్రుంకెన్. ౧౦౯

వ. అంత రామలక్ష్మణులు సమయోచితంబులు దీర్చి, యారాత్రి పుచ్చి మఱునాఁడు రేపకడ లేచి, స్నానసంధ్యాద్యనుష్ఠానంబు లాచరించి వైశ్వానరార్చనాయత్తుండగు విశ్వామిత్రుంగాంచి యిట్లనిరి. ౧౧౦

గీ. అనఘ మఖ మెన్నిదివసంబు లాచరింప
వలయుఁ దద్విఘ్నకారులు వచ్చునట్టి
సమయ మెద్ది యనన్ మునిసత్తముండు
పలుక కుండిన నచ్చటిపరమమునులు. ౧౧౧

సీ. కౌశికముని దీక్షఁ గైకొని యున్నాఁడు
గావున సమయంబు గాదు పలుక
నా అహోరాత్రంబు లాదరంబున మీర
లధ్వరరక్ష సేయంగవలయు
నని చెప్ప రాఘవు లతిదృఢచిత్తులై
బాణబాణాసనపాణు లగుచుఁ
గనురెప్ప వేయక కడుజాగరూకులై
రేబగల్ నిశ్చలరీతి యమర
ఖండనోద్యుక్తమతు లగుచుండి రంతఁ
గౌశికమునీంద్రుఁ డామ్నాయగదితసరణి
నవ్యఘృతసమిధాదికద్రవ్యములను
వీతిహోత్రార్పితములు గావింపుచుండె. ౧౧౨

గీ. యాజకముఖోక్తనిగమోక్తు లతిశయిల్లఁ
బావకజ్వాల లాకాశ భాగమంట
హవ్యభుజులు మహానంద మందుచుండ
నధ్వరక్రియ రమ్యమై యమరుచుండె. ౧౧3

వ. అంత నాఱవదినంబున, ౧౧౪

సీ. నీచాత్ములైన మారీచసుబాహులు
యాతుధానాలిసమేతులగుచు

సింహనాదంబులు సేయుచు సభమునఁ
దమమాయచే వారిదములఁ బన్ని
వేదికపై రక్తవృష్టిని గురియించి
క్రతువిఘ్న మొనరింపఁ గడఁగునపుడు
రాఘవుం డధికసంరంభుఁడై తమ్మునిఁ
గనుఁగొని చూడు మీదనుజుఁ గూల్తు
ననుచు మారీచుపైఁ బవనాస్త్రమేయఁ
దన్మహామారుతంబున దైత్యుఁ డుదఁటు
మాలి శతయోజనంబులు దూలి పాఱి
నీరధిని గూలె దేవతానికర మలర. ౧౦౧

ఉ. అంత రఘూద్వహుండు వెస నంబరభాగమునందు మంటల
త్యంతముఁ గ్రమ్ముచుండ ననలాస్త్రము గర్వితుఁడై సుబాహుదో
రంతర మంట నేయ వడి నగ్నిశిఖాగణదగ్ధుఁడయ్యు వాఁ
డెంతయు నార్చుచున్ రణమహాస్థలిఁ గూలెను వేల్పు లుబ్బఁగాన్.

క. పిమ్మట రాఘవుఁ డనిలా
స్త్రమ్మఁ బ్రయోగించి దనుజసంఘమ్ముల నో
క్కుమ్మడిఁ బుడమిం గూల్చెను
సమ్మదమున సురలు దన్నుఁ జదల నుతింపన్. ౧౦౨

క. సకలాసురనికరంబులఁ
బ్రకటభుజాబల మెసంగఁ బరిమార్చి మహో
ధికుఁడై వెలిఁగెడు రాముని
నకలంకుని బొగడిరంత నమరులు మునులున్. ౧౦౩

వ. ఆసమయంబున, ౧౦౪

గీ. మఘము సంపూర్ణ మొనరించి మౌనివరుఁడు
గాధినందనుఁ డనఘు నిక్ష్వాకువంశ
భవుని నారామభద్రుని బహువిధములఁ
బ్రస్తుతింపుచు ముదమునఁ బలికె నిట్లు. ౧౦౫

క. నామఘమ్ముఁ రక్షించితి
వో మహనీయప్రతాపయుత ! నేఁటికి నా
కామితము గంటి కీర్తుల
చే మించితి నీవు నాకు శిష్యుఁడ వగుటన్. గ౧౧

క. జనకునిశాసనమున నా
వెనుకం జనుదెంచి గురునివిధమున నన్నుం
గనుచును నేఁ బూనిన పని
కొనసాగ్టం జేసి తీవు గుణనిధి వగుటన్. గ౨౨

క నీపాదములకు దాసుల
మోపావనచరిత ! తాపసోత్తమ ! యనుకం
పాపర ! పాపరహిత ! మా
కేపనిఁ జెప్పిన నొనర్తు మిఁక నీయాజ్ఞన్. గ౨3

క. కరుణాకటాక్షమున మము
నిరతముఁ గనుఁగొనఁగవలయు నీ వట్లైనన్
సిరులును గీర్తులు మాకి
ద్ధరణిని జెన్నొందుచుండుఁ దాపసవర్యా ! గ౨౪

క. నీదయఁ గాంచినవారికి
మేదినిలో శుభము లపరిమితముగఁ గలుగున్
గాదే గాధేయ ! మహా
వేదాఖిలశాస్త్రతత్త్వవిద్యానిపుణా ! గ౨గ

ఆ. వె. అనుచు వినుతిఁజేయ నంతరంగమునందు
సంతసమునఁ బొంగి సంయమీంద్రుఁ
డర్క కులవరేణ్యుఁడగు రామవిభుఁ జూచి
యనఘచరిత ! విను మటంచుఁ బలికె. గ౨౬.

సీ. ఘనపుణ్యమూర్తియా జనకుండు గావించు

ముదముతో నిచ్చటి మునిగణంబులు నేను,
గానఁ దమ్ముఁడు నీవు కరము వేడ్క
మాతోడ నరుదెంచు మానుగా నచ్చట
గంధపుష్పాక్షతకలితధూప
దీపార్చితము దివ్యరూపంబు దుర్భర
మురుతరసార మత్యున్నతంబు
నైన శివకార్ముకము గల్గు ననఘ! దాని
సంతతంబును బూజించు జనకవిభుఁడు
ధరణిఁ దద్దర్శనము మోదకరము గాన
మనము గనుఁగొంద మా విల్లు మనము చెలఁగ. ౧౨౪

క. నరపతు లందఱు నాగురు
తరచాపము నెక్కు వెట్టఁ దలఁపుచు మిథిలా
పురి కేఁగి జనకపతిమం
దిరమునఁ జెన్నొందుచున్న దృఢచాపంబున్. ౧౨౫

గీ. కాంచి తచ్చారుతకు సంతసించి యౌర!
యంచుఁ దత్సన్నిధికి నేఁగుదెంచి, దాని
వంచి యెక్కిడలేక లజ్జించి మిగుల
వంచితుల మైతిమంచు భాషించి మరల. ౧౨౬

వ. తమతమనగరంబులకుఁ జనుచుందురని చెప్పిన విని, రామలక్ష్మణులు తత్కార్ముకదర్శనోత్సుకులైయుండ, విశ్వామిత్రుండు దాశరథిసహితుండై మునిగణంబులు పరివేష్టింప వనదేవతల నుద్దేశించి, యోవన దేవతలారా! మీయనుగ్రహంబున నీయాశ్రమంబునఁ దపస్సిద్ధుండ నైతి, మీకుఁ గుశలం బగుంగావుత, మీచేత ననుజ్ఞాతుండను గదా పోయివచ్చెద నని పలికి, కృతప్రణాముండై జాహ్నవియుత్తరతటంబున హిమశైలంబుఁ గనుంగొని, ప్రదక్షిణంబు గావించి నమస్కరించి, యుత్తరాభిముఖుండై దూరపథంబరిగి, సూర్యాస్తమయంబగు

టయు శోణనదీతీరంబున సంధ్యాద్యనుష్ఠానంబు లాచరించి, యొక్క మునివాసంబునం బ్రవేశించి కూర్చుండియున్న కౌశికమునీంద్రు నచ్చటి మునిగణంబు లర్ఘ్యపాద్యాదివిధులం బూజింప, రామభద్రుండు గాధేయసమీపంబునం నుండి, యోమునివరా! యీరమ్యతపోవనసమేతంబగు దేశం బెవ్వరి దెఱింగింపు మనిన న మ్మునీంద్రుఁడు రాఘవున కిట్లనియె. ౹౹30

క. నరవర ! కుశుఁడను నొకఋషి
సురుచిరవైదర్భియందు సుతుల కుశాంబున్
వరమతి కుశనాభు నసూ
ర్తరజసు వసునామధేయుఁ దనరఁగఁ గనియెన్. ౹౹31

క. సూనుల నొగిఁజూచి యతం
డోనందనులార ! మీరలురుధర్మమతిన్
మానవుల నేలుచుండుఁడు
నా నలువురు జనకభాషణప్రముదితులై. ౹౹32

సీ. ఘనుఁడు కుశాంబుండు కౌశాంబియు కుశనా
భుండు మహోదయాపురవరంబు
శాంతుం డమూర్తరజసుఁడు ధర్మారణ్య
మను వసువు గిరివ్రజనగరంబుఁ
బొసఁగ రచించి రవ్వసువు నామంబున
వసుమతి యనఁగ నివ్వసుధ పరఁగె
నీపంచశైలంబు లీభూమిఁ జుట్టును
విలసిల్లు నీమైను మలలనడుమఁ
దనరుచుండెడు మాగధీతటిని మగధ
దేశమునఁ బారుచుంట పృథ్వీశ ! యిద్ధ
రిత్రి మాగధి యనఁగ సుక్షేత్ర యగుచు
వెలయు నిది వసుదేశంబు వినుము మఱియు. ౹౹33

గీ. అనఘచరితుండు కుశనాభుఁ డనెడుపేర
నమరు రాజర్షి ...

వేలను మోదంబుతో గుణవతుల నతుల
మతుల రుచిరాకృతుల శతసుతులఁ గనియె. ౧౩౪

క. చపలోపమరుచులగు నా
నృపకన్యక లొక్కనాఁడు నిరుపమభూషా
తపనీయాంబరధరలై
యుపవనమునఁ జొచ్చి లీల లొప్పఁగ నచటన్. ౧౩౫

క. పటుతరవాద్యస్వనములు
ఘటియిల్లఁగ రాగతాళగతు లెసఁగంగా
నటనములు సేయుచుండఁగ
నట కనిలుఁడు వచ్చి వారి నరుదుగఁ జూచెన్. ౧౩౬

గీ. చూచి తమకంబుఁ జెంది, యో సుదతులార!
కడఁక మీరెల్ల నాప్రియకాంత లగుఁడు
సంతతామోదకరమైన జవ్వనంబు
నమరభావచిరాయువు లమరు మీకు. ౧౩౭

సీ. అనిన నవ్వుచు వార లాసమీరునిఁ జూచి
సకలభూతములందు సంచరించు
దేవతామూర్తివి నీ వెఱుంగనియట్టి
ధర్మముల్ గలుగునే తగనిమాట
లిటు పల్కఁ జెల్లునే యేము మాతండ్రిని
సరకుసేయక కులాచారసరణిఁ
దప్పి నిన్ను వరింపఁ దగునె మాజనకుండె
మాకు దైవము గాన మమ్ము నెలమి
తండ్రి యెవ్వని కిచ్చు నాతండు మాకుఁ
బతి యనుచు నందఱొకసారె పలుక వినుచుఁ
గనలి పవమానుఁ డతిబలగాత్రములను
జొచ్చి భంజించి సరగ గుజ్జుల నొనర్చె. ౧౩౮

గీ. అంత నక్కన్య లిళ్లకు నరిగి సిగ్గు
వడుచు లోచనముల బాష్పవారి దొరుఁగఁ

దద్ద గుందుచునుండ నాత్మజలఁ జూచి
హృదయ మడలంగ కుశనాభుఁ డిట్టులనియె. ౧౩౯

ఆ. వె. తనయలార! మీకతన మత్కులం బొప్పె
నేను సేయు సుకృత మిటు ఫలించె
చింత దొలఁగె ముదము చేరె మీసుగుణంబు
లార్యనుతము లగుచు నతిశయిల్లె, ౧౪౦

క. కరువలి మిము నందఱఁ గని
వరియింపుఁడటన్న నతని వారింపుచు వే
గిరపడకుండిన మీక్షమ
పరఁగన్ వినుతింప వశమె బ్రహ్మకునైనన్. ౧౪౧

సీ. క్షమ యలంకారంబు క్షమయ ధర్మంబును
క్షమయ మోక్షంబును క్షమ యశంబు
క్షమ సద్గుణంబును క్షమయ యజ్ఞంబును
క్షమయ దానంబును క్షమయ తపము
క్షమయందె వసియించు సకలజగంబులు
గాన క్షమావతులైన మీకు
క్షమ నన్యకన్యలు సరిగారటంచును
వేమఱు మన్నించి వీడుకొల్పి
రహి నమాత్యులతోడ మంత్రం బొనర్చి
దేశకాలపాత్రంబుల తెఱఁగు లెఱిఁగి
నాత్మజలఁ దగువరునకు నొసంగ
వలయు ననుచును వెండియుఁ బలికె నిట్లు. ౧౪౨

క. మదియను మునివరునకు సో
మదయను గంధర్వి చారుమతి పరిచర్యన్
ముద మొనరిచి తత్కృప బ్ర
హ్మదత్తుఁడను వానిఁ బడసె మానసపుత్రున్. ౧౪౩

గీ. బ్రహ్మదత్తుండు కాంపిల్యపట్టణమున
కరిగి జను లెల్ల దను మెచ్చ నవని నేలు
చుండెఁ గావున నమ్మహీమండలేశు
నకు నొసంగెద నూర్వుర నాదుహితల ౧౪౪

సీ. అని పల్కి బ్రహ్మదత్తుని వేగ రప్పించి
మన్నించి భానుసమప్రతాపుఁ
డగు కుశనాభుండు నగురీతి నూర్వుర
కన్యల నొసఁగినఁ గ్రమముతోడ
నతఁడు వారికరగ్రహణము సేయంగన
క్కాంతుని కేల్సోకినంతలోన
న ప్పడంతుకలు కుబ్జాకృతిహీనలై
యలరుచుండిరి సుందరాంగు లగుచు
నాత్మజలఁ జూచి జనకుండు హర్షమొందె
తండ్రి కొఁగిటఁ జేరి రత్తనయ లెలమి
నల్లునిం గూఁతుల నరేంద్రుఁ డాదరించి
పంపఁగా వార లరిగిరి ప్రమద మెసఁగ ౧౪౫

వ. అనంతరంబు. ౧౪౬

క. తనయప్రీతిం బద్మజ
తనయుండగు కుశుఁడు తనదుతనయునకుఁ దగన్
దనయుఁడు గలుగకయుండిన
మనుమఁడు గలుగంగఁ దాను మఖ మొనరించెన్. ౧౪౭

క. ఒనరిచి కుశనాభుం గనుఁ
గొని తనయుఁడ గాధియనెడు కొమరుఁడు నీకున్
జనియించు నతనివలనన్
ఘనయశ మొందెద వటంచుఁ గౌతుక మొప్పన్. ౧౪౮

గీ. ఆ కుశుఁడు పంకజాసనలోకమునకు
నరిగెఁ బిమ్మటఁ గొన్నివాసరము లరుగ
నొనరఁ గుశనాభునకు గాధిజనవరుండు
పుట్టె నారాజమణి కేను బుట్టినాఁడ. ౧౪౯

క. నాకగ్రభగిని సత్యవ
తీకన్యక రుచికుసతి పతి మృతుఁడైనన్
శోకింప కతని వెంబడి
నాకమునకు నొడలితోడ నరుదుగ నరిగెన్. ౧౫౦

గీ. అరిగి సుకృతవశంబున నసఘచరిత
సత్యమయి సత్యవతి హిమాచలమునందు
కౌశికీనామధేయంబు గనిన దివ్య
నది యగుచుఁ బుట్టె జగము లానందమొంద. ౧౫౧

క. భగినీస్నేహమునఁ దదా
పగచెంత వసింతు నేఁ దపముసేయుచు నో
జగదవ! సిద్ధాశ్రమ మది
దగ నీకతనన్ మనోరథం బటఁ గంటిన్. ౧౫౨

క. శ్రీకరమగు కుశకులమునఁ
బ్రాకటముగ నుద్భవించి ప్రబలితిఁగానన్
నాకుం గౌశికనామము
లోకములో వినుతికెక్కె లోకస్తుత్యా! ౧౫౩

క. నీ వడుగు దేశవిధమును
మావంశసమాగతక్రమము దెలిపితి రా
జీవదళేక్షణ! యీవన
మావృతరక్షఃసమూహమై యిపు డుండెన్. ౧౫౪

ఉ. శీతమరీచి మింటఁ గడుచిత్రముగా నుదయించి దిక్చయం
బాతతచంద్రికావిశదమై దనరారఁగఁ జేసె చేసిన

వ్రాతము లుల్లసిల్లఁగ నవారణలీల వెలుంగఁ జూచితే
యీతఁటి సర్ధరాత్రమగు నీవును దమ్ముఁడు నిద్రఁబొం డిఁకన్. ౧౫౧

వ. అని పలికి మిన్నకుండిన మునులు సంతోషించి, విరించితుల్యుండగు కౌశికునిం బూజించి, తద్వంశసంభవమహీపతుల వినుతించి, తదగ్రజ యగు కౌశికిపావనచరిత్రంబు గణుతించిన సంతుష్టాంతరంగుండై విశ్వామిత్రుండు నిద్రించె, రామలక్ష్మణు లాశ్చర్యమానసులై గాధి నందనుం గొనియాడి శయనించి, రంతఁ గొంతసేపున కమ్మునివరుండు మెల్లని యుదితసూర్యుండునుంబోలె వెలుంగుచుఁ బ్రభాత సమయం బున రామలక్ష్మణుల నుచితవాక్యంబుల మేలుకనిపి, వారలుం దానును దాత్కాలికానుష్ఠానకృత్యంబుల నిర్వర్తించి, పయనంబై గదలి, శోణ నదిం దాఁటి, యామద్వయంబునకు దూరమార్గంబరిగిన ముందట శీతలప్రవాహశీకరయుక్తంబును, కమలకైరవకల్హారాదిసుగంధ బంధు రంబును మందగమనంబును మనోహరంబును నగు మలయమారుతం బభిముఖంబై శరీరంబులకు సోఁకిన నందఱు నానందితహృదయా రవిందులై యున్నయెడ. ౧౫౨

క. నరవరసూనులు గాంచిరి
సరసిజకువలయపరాగసముదయసంగన్
గురుతరనిస్వనభృంగన్
తరలతరంగన్ లసత్పతంగన్ గంగన్. ౧౫౩

సీ. కని రామచంద్రుండు కౌశికుఁ గనుఁగొని
మునివర! గంగపావనచరితము
విన వేడుకయ్యెడు విబుధలోకాపగ
త్రిభువనంబులకు నేరీతి వచ్చె?
నిమ్మహావాహిని పిమ్మట నద్భుత
గతిసాగరముతోడఁ గలసె నెట్లు ?
విశదంబుగా నాకు వినుతింపవలయు నిం
కీ వెల్గుంగని వార్త లెందు లేవు

వరతపోధననిధివి సర్వజ్ఞమతివి
వత్సలత మమ్ముఁ బ్రోచుదేవతవు నీవు
గాన నిన్వేఁడితిని బుణ్యకథవచింప
ననిన రాముని కనియె నయ్యతివరుండు. ౨౨౮

క. గంగాపావనచరితము
రంగుగ నెఱిఁగింతు నీకు రఘువర్య! రణా
భంగపరాక్రమ ! దీని వి
నంగలమనుజాలియఘము నాశమునొందున్. ౨౨౯

వ. అని పలికి, సమాహితచిత్తుండవై వినుమని మునిపతియిట్లనియె. ౨౩౦

గీ. మేరుపుత్రికయైన మనోరమకును
తుహినభూధరవరునకుఁ దొలుత ఘటనఁ
జేసి, యాదంపతులకు సృజించె సుతుల
గంగ యుమ యన నిద్దఱఁ గమలజుండు. ౨౩౧

సీ. హిమవన్నగాధీశుఁ డేపారు ముదమునఁ
దనతనూభవలను మనుపుచుండ
నాతని చెంగటి కరుదెంచి వేల్పులు
నీ యగ్రసుత గంగ నేఁడు మాకు
నీయంగఁ దగు లోకహితముకై యని వేడ
గంగను సురల కొసంగ నదియు
దేవాళితో నమరావతి కేతెంచెఁ
దరువాత నయ్యుమ హరునిఁగూర్చి
భూరితప మాచరింప నా భూధరేంద్రుఁ
డయ్యుమాకన్యభావంబు నాత్మ నెఱిఁగి
నిఖిలలోకేశ్వరుండగు నీలకంఠు
నకు నొస [illegible] ౨౩౨

క. గంగామలకథలు వినం
గంగామలకుందతారకానిభయశ మ
బ్బంగద్మ జనులకు సప్తతు
రంగోజ్వల దివ్యధామ! రాఘవరామా! గీ=3

వ. జనవరా! తరువాతి వృత్తాంతంబు చెప్పెద వినుము. పరిణయానంతరం మునఁ బార్వతీపరమేశ్వరు లొక్కసమయంబున మదనశరదళిత హృదయారవిందులై, యనేకదివ్యవర్ష సహస్రంబులుసురతాసక్తులై యుండిన వారిశరీరంబులవెడలు తేజంబులవలన లోకంబుల కుపద్రవంబు వాటిల్లునని బ్రహ్మాదిదేవత లమ్మహాదేవుపాలికి వచ్చి సాష్టాంగదండప్రణామంబు లాచరించి, నిగమవచనంబుల వినుతించి, సురతంబుచాలించి తపంబుసేయుండని ప్రార్థించిన భవుండు కరుణించి, సురతంబుచాలించి, తనతేజంబు నమరుల వహింపుఁడని పల్కి, రేతఃపతనంబు చేసిన దానిందేవతలయనుమతంబున భూమియుఁ బావకుండును బవమానుండును దాల్చినంత భవానియుఁ దనసంతానప్రయత్నంబున కంతరాయంబు గావించి రని యమరుల ననపత్యులుగా శపించి సకల మానవుల కనుభవపత్ని వగుమని భూదేవికి శాపంబొసంగిన సిగ్గువడి యింద్రాదిదేవతలు నిజనివాసంబులకుం జనిరంత ఫాలలోచనుండును, హిమవన్నగోత్తరశృంగంబునందు నియతుండై తపంబుసేయుచుండె, నటఁగొంతకాలంబునకు వేల్పులు మునిగణసమేతులై విరించికడకుం జనుదెంచి, సేనాపతిని సృజింపుమని ప్రార్థించిన నతం డగ్నిదేవు నారాధించుం డనుటయు, నమరు లట్లు గావించిన పావకుండును దనశరీరంబున వెలుంగుచున్నయమ్మాతేజంబు గంగయందు విడుచుటయు, గంగయు నాతేజంబుదాల్చి గర్భిణియై గర్భంబు దుర్భరంబైన నగ్నిదేవుననుమతి హిమవంతంబున నొక్కచోట శరవణంబున విడిచిన నందువలనఁ గుమారుండు జనించె, నచ్చటికిఁ గృత్తికలువచ్చి యక్కుమారునిచేత స్తన్యపానంబుచేయించి రతండు దేవసేనాగ్రేస

రుండై పార్వతీనందనుండును, గాంగేయుండును, పావకాత్మజుండును శరజన్ముండును, సేనానియు, కార్తికేయుండును ననునామధేయంబు లం బ్రసిద్ధుండయ్యె నని చెప్పి యిట్లనియె. ౧౬౮

క. ధరలోనం గార్తికేయుని
చరితము వినునట్టి విబుధజను లుల్లమునన్
దిరమునం గోరిన కోర్కులు
కరమొందుచుం దుదిని ముక్తిం గాంతురు వత్సా. ౧౬౯

వ. మఱియు గంగావృత్తాంతంబు చెప్పెదవినుమి, మిక్ష్వాకువంశసంభవుండగు సగరుం డశ్వమేధయాగదీక్షితుండై హయంబు విడిచిన నయ్యశ్వంబునాఖండలుండు రాక్షసాకారుండై యపహరించిన,సగరతనయు లఱువది వేవురు తండ్రియానతి నశ్వాన్వేషణంబుసేయంబూని యెందునుం గానక, రసాతలపర్యంతంబు భూతలంబు ద్రవ్వి యచ్చట నిమీలితనయనుండై ,తపోనిష్ఠాగరిష్ఠుండై యున్న కపిలుసమీపంబున నయ్యశ్వంబుం గాంచి, యమ్మహాత్ము నశ్వచోరుంగాం దలంచి, భర్జించి యతనికోపాగ్నివలన భస్మీభూతులై ,రంత సగరుండు దనపౌత్రుండగు నంశుమంతు నశ్వంబు వెదకం బనిచిన నతండు పితృవర్గంబుజనిన మార్గంబున పాతాళలోకంబున కరిగి యచట పితృభస్మరాసులంగని శోకించి,యచ్చోట్టనున్న హయరత్నంబుం గొనివచ్చి, సగరున కొసంగిన నతండు యాగంబుసంపూర్ణంబుగావించె,నటంగొంత కాలంబరిగిననంశుమంతుని పౌత్రుండగు భగీరథుండు తనప్రపితామహులకు నాకలోకనివాసంబు గోరి,గోకర్ణక్షేత్రంబున కరించి నుద్దేశించి బహుసహస్రాబ్దంబులు నియతాహారుండును నూర్ధ్వబాహుండునునై పంచాగ్నిమధ్యంబున నుండి యుగ్రతపంబు గావించిన తపఃప్రీతుండై కమలజుండు వరంబువేఁడుమనిన నారాజేంద్రుండు పితృభస్మరాసులమీఁద గగనగంగం బ్రవహింపఁజేయుమనిన నట్లకాక యని గంగాపాతంబునకు భూతలంబు సహింపఁజాలదు,కావున గంగాభరణంబునకు భుజంగాభరణుం

ప్రార్థించుమని చెప్పి బ్రహ్మయంతర్హితుండగుటయు నానృపాలుండు చంద్రశేఖరుంగూర్చి తపంబొనర్చిన నతనితపంబునకు మెచ్చి, యీశానుండు ప్రసన్నుండై వియన్నదిం దాల్తునని వరంబిచ్చె, నంతగంగయు నాకాశంబునుండి శివునిజటాజూటంబునందుఁబడి, బలిసదనంబున కేతేర సంభ్రమించిన శంకరుండు కుపితుండై యమరనదింగదలకుండ జటానివహంబున బాధించె. మరల నమ్మేదినీశ్వరుండు గంగాధరుంగూర్చి తపంబుఁజేసిన గిరీశుండు కరుణించి బిందుసరోవరంబున విష్ణుపాదోద్భవను విడిచె, నందువలననేడుప్రవాహంబులు పుట్టె, నందుసప్తమవాహిని భగీరథు వెనుక వచ్చుచు జహ్నుయజ్ఞాయతనంబుముంచిన జహ్నుండు కోపవహ్నిసమేతుండై గంగాప్రవాహంబుకడుపునిండం ద్రావి, సురమునీంద్రప్రార్థితుండై కర్ణరంధ్రంబులవలననమ్మహానదిని మరలవెడలించె, నక్కతంబున గంగ జాహ్నవి యనంబరఁగె, తదనంతరంబ యవ్వాహిని సాగరమార్గంబున నాగలోకంబునకేఁగి సగరసుతభస్మరాసులపయిం బ్రవహించిన సాగరులు స్వర్గనివాసులై, రంతఁ బితామహులుండును జనుదెంచి ప్రపితామహులనాకనివాసులం జేసిన భగీరథునిచరిత్రంబు వినుతించి, తనలోకంబునకరిగిన నవ్విశ్వంభరానాయకుండు పితృవర్గంబునకు గంగోదకంబుల ధర్మోదకదానంబులు చేసి ప్రీతుండై తనపురంబునకునేఁగి ధర్మమార్గంబునఁ బ్రజాపాలనంబు సేయుచు బహుకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి త్రిదివంబునకరిగె, భగీరథసమానీతయగుటఁజేసి గంగ భాగీరథియనంబరఁగెనని చెప్పి, రామభద్ర ! గంగావతరణక్రమంబును వినిపించితి, నీకు భద్రప్రాప్తియగు, నీగంగాప్రభావంబు వినినమానవులకు దురితంబులుదొలంగు మనోరథంబులు సిద్ధించు ననిపల్కిన. గీఁటి

సీ. రంగు మీఱువియత్తరంగిణీ కథముని
పుంగవుచే వినుటం గరంబు
పొంగుచుండెడు నంతరంగంబులో సుంద
రాంగుండు సంగరాభంగవీర్యుఁ

డింగితజ్ఞుఁడు రాముఁ డంగజాతహరాంఘ్రి
సంగమానసుని బతంగతేజు
మంగళాచారు విహంగమరాజతు
రంగసన్నిభుఁ గౌశికుం గనుఁగొని

గీ. గంగసత్కథ నీవు చెప్పంగ వింటి
కొంగున ముడుచు బంగారుభంగి నొప్ప
తుంగసుకృతంబు కాంక్ష దీరంగఁ గలిగె
సంగతానంద! నిన్ను మెచ్చంగ వశమె? ౬౭

చ. అన విని సంతసించుచుఁ గుశాన్వయుఁ డజ్జనపాలనందనుం
గనుఁగొని పల్కె బాహుబలఖండితదానవవీర రాఘవా!
వనజహితుండు గ్రుంకెఁ గనవచ్చెఁ దమిస్రము దిక్కులందు నిం
క ననుజుఁ డీవు నుఖముగా శయనింపుఁడు నాదుసన్నిధిన్. ౬౮

క. అని పల్క రామలక్ష్మణు
లనురాగముతోడ మునిజనాధ్యసమీపం
బునఁ దృణవిరచితశయ్యల
ననువుగ నిద్రింపఁగా నిశాంతం బగుడున్ ౬౯

గీ అపుడు పౌలోమి తనపట్టె యాడుకొనఁగఁ
దలఁచి తత్తల్పమున కూర్ధ్వతలమునందు
వ్రేలఁగట్టిన బలుమగఱాలబంతి
విధము దోఁపంగ దివిఁ దోఁచె వేఁగుజుక్క. ౭౦

గీ. జక్కవలవిందు పొడము ప్రాగ్దిక్కునందు
మ్రొక్కుఁడని తెల్పుచుండె నాఁ గుక్కుటములు
ఱెక్క లల్లార్చి కంఠముల్ నిక్కఁజేసి
కుక్కురో కో యటంచును గూయ సాఁగె. ౭౧

వ. ఆసమయంబున రామలక్ష్మణులు మేల్కాంచి సూర్యోదయావసరం
బునం బ్రాతరాహ్ణికకృత్యంబుల నిర్వర్తించి సకలమునిజనంబులకు

నమస్కరించి, కౌశికసమేతులై యచ్చోటు నిర్గమించి, పరిపూరిత భక్తమనోరథయగు భాగీరథి నుత్తరించి, యవ్వలితీరంబునఁ బ్రవేశించి, యాసమీపంబునందు కరితురగాందోళికాదివిరాజితంబును, ధనధాన్యసంపన్నంబును, నిరంతరజనసంకులంబును, మణిగణఖచిత గోపురంబును, నగు విశాలాపురంబుం గాంచి, తద్విలాసంబునకు హర్షించి, విశ్వామిత్రుంజూచి, యిన్నగరం బెవ్వరి దెఱింగింపుం డనిన, రామచంద్రునకుఁ గౌశికుం డిట్లనియె. ౧౭౨

సీ. విను రామ ! తొల్లింటి వృత్తాంత మంతయుః
విని పింతు నెమ్మది వేడు కలర
బలవంతులగు నిర్జరులు దితినందనుల్
దమలోన నమృతంబు ద్రావఁ గోరి
వరమందరాద్రిఁ గవ్వంబుఁ గావించియు
నురగేంద్రుఁ ద్రాడుగా గిరికిఁ బన్ని
క్షీరసాగరము దుర్వారులై దరువంగ
నబ్ధిఘోషములు బ్రహ్మాండ మెల్ల
గీ. నిండె; నంతట దుగ్ధవార్నిధిని దివ్య
తనుఁడు దివ్యకమండలుధారి యగుచుఁ
బుట్టె ధన్వంతరి యనంగఁ బురుషవరుఁడు
దిశలఁ దనమేనికాంతులు దీటుకొనఁగ. ౧౭౩

వ. మఱియును. ౧౭౪

క. అచ్చుగ నమరులు దనుజులు
మచ్చిక లొదవంగ కడలి మథియింపంగా
నచ్చర లఱువదికోటులు
వెచ్చెర జనియించి రందు సితకమలాక్షా ! ౧౭౫

వ. మఱియు నప్పాలవెల్లియందు 'వారుణి' యను సురయును, 'ఉచ్చైశ్శ్రవం' బను హయంబును, 'ఐరావతం' బను గజంబును, కమలాదేవి

యు, కౌస్తుభరత్నంబును, కల్పవృక్షంబు నాదిగా ననేకంబు లుద్భ
వించినవెనుక నమృతం బొదవిన నయ్యమృతంబునకై దేవదానవులు
కలహించుచుండ నాసమయంబున విష్ణుండు జగన్మోహినియై, తన
మాయాప్రభావంబున దైత్యసమూహంబు మోహితంబు గావించి,
యమృతం బపహరించె; నది కారణంబుగా సురాసురుల కధికసంగ్రా
మంబు వర్తించె. నందు నసురుల వధించి విజయంబుచేకొని, సురస
హితుండై యింద్రుండు సురలోకంబున కరిగి లోకత్రయుం బేలుచు
సుఖంబుండె; ననంతరంబ. ౧౭౬

క. అమృతనిమిత్తంబున న
య్యమరులకును రక్కసులకు నధికము గాఁగన్
సమరం బగుటయు దానన్
విమతులచే సుతులు డెగుట విని దితి మదిలోన్. ౧౭౭

సీ. తద్దయు శోకించి తనవిభుఁ గశ్యప
మునివరుఁ గనుఁగొని వినతిఁ జేసి
యనఘాత్మ! సురలు మదాత్మజాతుల నెల్లఁ
దునుమాడి రాజిలో దోర్బలమున
నస్తుతనై యాత్మలో నలమట నందుచు
నుంటిఁ గావున నాకు నురుబలుండు
పురుహూతహరుఁడగు పుత్రుండు గలుగంగఁ
గరుణింపవలయు శీఘ్రమున దేవ!

గీ. యనుడుఁ దనసతి దితిఁ గాంచి మునివరుండు
భూరికారుణ్యపీయూషపూరితాత్ముఁ
డగుచుఁ గోమలి నీవు నన్నడిగి నట్ల
సేమ మొనరింతు నెమ్మదిఁ జింత విడువు. ౧౭౮

క. తరుణీ వేవత్సరములు
నిరుపమశౌర్యమునఁ దపము నీ వొనరింపన్

గురుతరబలుఁడు పురందర
హరుఁడగు తనయుండు నీకు నరుహుగఁ బుట్టున్. ౧౭౯

క. అని యంగమార్జనముఁ గై
కొనఁజేసి మునీంద్రుఁ డేఁగె గురుతరతప మే
పునఁ జేయఁగఁ గశ్యపుఁ డిటు
చన దితి కడునిష్ఠఁ దపము సలుపఁగఁ దొడఁగెన్. ౧౮౦

గీ. దితి తపముసేయుచుండుటఁ దెలిసి యాత్మ
నడలి సురలోకనాయకుం డరుగుదెంచి
ఫలజలాదు లొసంగుచుఁ బరమభక్తి
సవతితల్లికి శుశ్రూష సలుపుచుండె. ౧౮౧

వ. ఇట్లు సంక్రందనుండు సవిత్రికి సవినయంబుగా సపర్య లాచరించుచుండఁ బదివత్సరంబులు గొఱంతగా సహస్రవర్షంబులు నిండుటయు, నొక్కనాఁ డపరాహ్ణసమయంబున శిరోభాగంబు చరణప్రదేశంబుగా విస్రస్తకేశపాశయై దితి నిద్రించుచుండిన, ౧౮౨

గీ. అశుచియైయుండె దితి యిది యవసరంబ
టంచు దితి బొజ్జలోఁ బ్రవేశించి యాత్మ
కరకలితవజ్రధారఁ దద్గర్భ మేను
ఖండములు గాఁగఁ గోసె నాఖండలుండు. ౧౮౩

గీ. కోయునెడ బాధ కోర్వక కుక్షి నున్న
శిశువు రోదింపఁగా సునాశీరుఁ డుల్ల
మలర 'మారుద' 'మారుద'యంచుఁ గోయ
మిట్టిపడి లేచి యా సాధ్వి యిట్టు లనియె. ౧౮౪

క. తెగటార్పకు తెగటార్పకు
తగ వెఱలు మటన్న దేవతానాయకుఁ డొ
ప్పుగ వెడలి వినయమొప్పఁగ
నగపతి కేల్మోడ్చి యిట్టు లనియె భక్తిన్ ౧౮౫

శా. తల్లీ! నీ వశుచిత్వ మొప్పఁ గడు నిద్రం జెందియుండంగ నే
నుల్లంబం దిది వేళయంచు దళనోద్యోగంబు గావించితిన్,
తల్లాక్యం బొనరింపకున్న సుతు డుద్యల్లీల నీకబ్బువాఁ
డుల్లాసంబున నన్నుఁ ద్రుంచు ననిలో నుగ్రక్రియారంభుఁడై. ౯౬

క. నీ వెఱుఁగవె యా చందము
దేవీ నీసుతుఁడు నన్నుఁ దెగటార్పంగా
భావుకమె నీకు మదిలో
భావింపుము నేను నీదుపట్టిని గానే. ౯౭

ఆ. వె. కాన నీవు నన్ను గరుణఁ బ్రోవు మటంచు
వేల్పుఱేఁడు తన్ను వేఁడుచుండ
నమరవరుఁ డసాధ్యుఁడని దితి శపియింప
లేక మిగుల నుమ్మలించి పలికె. ౯౮

క. తనయుండ వినుము నాచే
సిన దుష్కృత మిట్టి కీడుచేసెను నీ వే
మొనరించెదు నీపైఁ గిని
యను నినుఁ బ్రార్థింతు నాస్పృహను గూర్పు మిఁకన్. ౯౯

సీ. సుత ! భవత్కులిశఖండితగర్భసప్తఖం
డంబులు సతమారుతంబు లగుచు
గగనవాతస్కంధగాములు గానిమ్ము
మఱియును విను మాద్యమారుతంబు
నలువలోకమున రెండవమారుతము సురా
ధీశలోకమునఁ దృతీయమారు
తము గగనంబునం దక్కిన నలుమారు
తములు నల్దిక్కుల నమరమూర్తు
లగుచు నీయాజ్ఞ మెలఁగని మ్మనఘ నీవు
కినుక 'మారుద' 'మారుద' [illegible]

తాహ్వాయంబులఁ దసరని మ్మనిన వినుచు
నింద్రుఁ డాదైత్యమాతతో నిట్లు లనియె. ౹౯౦

వ. దేవీ నీమనోరథంబు సిద్ధించు, నీకొమరులు సప్తమారుతంబులై దేవ
మూర్తులై సకలలోకంబులయందు సుఖంబునం బ్రవర్తించుచుందురు
సంతోషింపు మని పలికి, యప్పాకశాసనుండు నాకంబున కరిగె,
నిట్లు పుత్రాశంజేసి తపోనియతయైన దితికి శతమఖుండు పరిచర్య
నొనర్చుచుండిన దేశం బిదియని చెప్పి కౌశికుం డిట్లనియె. ౹౯౧

క. జనవల్లభ ! యిక్ష్వాకుని
తనయుండు విశాలుఁ డనఁగఁదగు రాజేలున్
ఘనమగు నీపట్టణ మా
తనిపేర విశాల యనఁగఁ దగు నిప్పురియున్. ౹౯౨

గీ. ఆవిశాలు విశాలాన్వయంబునందు
'సుమతి'యను రాజు జన్మించి సొంపు మిగుల
నీవిశాలాపురం బిప్పు డేలుచుండె
జనపతులు సంతతముఁ దన్ను సన్నుతింప. ౹౯3

ఉ. చాపకళాధురీణ నవసారసలోచన రామ ! యీవిశా
లాపురి నేఁటిరాత్రి మది లాలస మానఁగఁ బవ్వళించుచున్
రేపు విదేహకుం జని విరించిసమున్ జనకక్షితీశ్వరున్
బాపవిహీనుఁ జూత మని పల్కుచుఁ గౌశికుఁ డున్న యత్తఱిన్.

ఆ. వె. మునివరేణ్యురాక వినుచు నాసుమతియు
కరము భక్తి నెదురుగాఁగ నేఁగి
మ్రొక్కి యర్ఘ్యపాద్యము లొసంగి మన్నించి
కుశల మడిగి కరుణఁ గోరి మ్రోల. ౹౯౫

వ. ఉన్నసమయంబున నమ్మునివరుం డజ్జనవరున కిట్లనియె. ౹౯౬

క. సుమతిగలవాఁడ వగుటను
సుమతి [illegible]

సుమతిజనవినుతకీర్తి వ
సుమతిన్ నినుఁబోలు నట్టి సుగుణులు గలరే. ౧౯౭

చ. అని వినయంబునం బలికి, యాతనితమ్ముని రాజు వేడ్క దీ
వనలిడి రామలక్ష్మణుల వార్తలు దెల్పఁగ నప్పురేంద్రుఁ డున్
మనమునఁ బొంగి రాఘవుల మన్ననఁజేయఁగ సత్వరంబుగాఁ
జని, తగ విశ్రమించి రట సంయమియున్ నరనాథసూనులున్ ౧౯౮

క. ఆరాతిరి చన మఱునాఁ
డా రాఘవు లమ్మునీంద్రుఁ డాత్మల ముద మే
పారఁగఁ బ్రభాతకృత్యము
లాహ్నికి నొనర్చి మిథిల కరిగిరి సరగన్. ౧౯౯

వ. అప్పు డప్పురోపకంఠంబున నొప్పుచున్న యొక్కయారామంబుఁ గని
యారామచంద్రుండు కౌశికమునీంద్రుం గాంచి, మునివరా! జనర
హితంబయ్యు నతిరమణీయంబగు నీయాశ్రమం బెవ్వరి దెఱింగింపవే
యని యడిగిన విశ్వామిత్రుం డిట్లనియె. ౨౦౦

ఉ. భూతలనాథ! రామ! విను పుణ్యచరిత్రుఁడు భూరితేజుఁ డా
గౌతముఁడన్ తపోధనుఁడు కాంత యహల్యయుఁ దానుఁ గూడి, ము
న్నాతతనిష్ఠ సన్మునిజనాళులు మెచ్చ ననేకవర్షముల్
ప్రీతిఁ దపంబు సేయుచును బెంపువహించుచు నుండ నొక్కెడన్.

గీ. అదను వేచి సురేంద్రుఁ డహల్యఁ గవయ
నాత్మఁ దలఁచుచు మదనశరాళిదళిత
హృదయుఁ డగుచును గౌతమాకృతి వహించి
పర్ణశాలఁ బ్రవేశించి పడతిఁ జూచి. ౨౦౨

క. కలకల్ల నవ్వుచు నీతోఁ
గలియఁగ నేతెంచినాఁడఁ గామిని యనినన్
కలవాణి యతనిఁ గనుఁగొని
బలభేదనుఁ డని మోహించి పలికెఁ బ్రేమన్ ౨౦౩

ఆ. వె. అమరవిభుఁడ వౌదు వసఘాత్మ నిక్కంబు
దెలుపు నా కటంచుఁ జెలువ పలుక
నమరవిభుఁడఁ గానె యతివ నీ కిప్పుడు
దాఁపనేల యని యతండుఁ బలికె. ౬౦౪

వ. అని పరస్పరంబును మనోరథంబులు తేటపడం జెప్పుకొనుచున్న
యెడ నమరవల్లభుం డహల్య కిట్లనియె. ౬౦౫

క. శాతోదరి! నీకొఱకై
గౌతమవేషంబు పూని కదిసితి నాకున్
జేతోమోదం బొదవఁగ
నీ సతి రతికేళిఁ దేల్పు మిందునిభాస్యా! ౬౦౬

క. గద్దరి మదనుం డిటు మన
కిద్దఱకుం ఘటనచేసె నిఁక నీమదిలో
తద్దయుఁ గూరిమి పెనఁగొన
ముద్దియ్యవె నాకుఁ దవిసి ముద్దియ వేగన్. ౬౦౭

సీ. కంజాక్షి! నీచన్నుఁగవ నంటఁ జాలని
కరముల కేమి సౌఖ్యంబు గల్గు
చంద్రాస్య! నీమేనిసౌరు గాంచనిమట్టి
కన్నుల కేమి సౌఖ్యంబు గల్గు
పల్లవపాణి! నీ పల్కులు వినని క
ర్ణంబుల కేమి సౌఖ్యంబు గల్గు
కలకంఠి! నీతోడఁ గలిసి యుండనిశరీ
రంబున కేమి సౌఖ్యంబు గల్గు

గీ. నాతి! నీకూర్మి నాకు నీనాఁటి కబ్బెఁ
బడఁతి! నేఁడు త్రిలోకాధిపత్య మబ్బె
నాఁటికంటెను మిగుల నానంద మయ్యె
నెలఁత! నాభాగ్యగరిమ వర్ణింపఁ దరమె. ౬౦౮

గీ. తరుణి నామాట లెల్ల చిత్తమునఁ బూని
నమ్మెదో నమ్మవో సంశయమ్ము గాని
నిన్ను శచికంటె నధికగా నెన్నుచుండఁ
దెలుపనేటికి నామది దేవుఁ డెఱుఁగు. ౬౦౯

క. ఎవ్వరు గనకుండఁగ నిటు
పువ్వారుంబోఁడి మనకుఁ బొందు ఘటిల్లెన్
పువ్వులకోరివజీరుని
చివ్వకు నీమెచ్చుఁ గొందు శీతాంశుముఖీ ! ౬౧౦

గీ. సకలశాస్త్రార్థవిజ్ఞానచతురుఁ డనుచు
వట్టిమాటలు జగతిలోఁ బుట్టెఁ గాని
స్నానసంధ్యాద్యనుష్ఠాన సరణి యట్ల
కామశాస్త్రార్థ మెఱుఁగునే గౌతముండు. ౬౧౧

గీ. గౌతమునకును నీకు సంఘటన మగుట
వనిత ! నీప్రాయ మిన్నాళ్లు వ్యర్థమయ్యె;
నడవిఁ గాచిన చంద్రికయట్లు ధరణిఁ
బాడు గృహమున నున్న దీపంబువోలె. ౬౧౨

గీ. జగతిలోపల నెంత యసాధ్యమైన
తపముచేతను సాధింపఁ దగును; గాన
భామ ! నీ వొనరించు తపంబువలన
నింద్ర భోగంబు సమకూరె నింత నిజము. ౬౧౩

క. చిలుకల కొలికీ ! మరువిరి
ములుకులగతి నీ కటాక్షములు నా యెదపైఁ
బలుమఱు నాటిన తాళం
గలనా ? నను నేలు సురతకలనాసక్తిన్. ౬౧౪

మ. లలనా ! నీపయిఁ గూర్మిపెంపున మహోల్లాసంబు దీపింపమున్
గలనైన న్నినుఁ గూడి చొక్క మదిలోఁ గాంక్షింతు నట్లైన ను

త్పలపత్రాక్షి ! మదంబకంబులను రెప్పల్ మూయ వేనాఁడు; మా
యలదైవంబు గృపావిహీనుఁడయి న న్నస్వప్ననిం జేయుటన్. ౬౧౧

వ. అనుచు నేకాంతంబుగా శచీకాంతుండు కంతుశరకంపితస్వాంతుండై,
తనయభిప్రాయంబంతయు నెఱింగించి వేఁడిన, మునికాంతయగు నహ
ల్య నిరంతరసంతోష భరితాంతఃకరణయై, యావంతైన వింత నొం
దక మంతనంబున నతని కిట్లనియె. ౬౧౬

గీ. అమరవల్లభ ! విను త్రిలోకాధిపతివి
నీకృపావీక్షణమునకు నేఁడు తగిన
దాననైతిని; నేఁజేయు తపము పండె;
నానుకోటిక కొనసాఁగె నాకనిలయ ! ౬౧౭

క. వనితలు ననుఁ గనుచు మహా
మునిమగువా ! యనుచుఁ బిల్వ మోదము గైకొం
దును; శ్రీమంతుని కలికీ !
యనునట్టులు దోఁచు నప్పదార్థమువలనన్. ౬౧౮

క. ఆ యర్థము నిక్కముగా
నామెడ వర్తించె నిపుడు నాకేశ ! త్రిలో
కాయతమానితరాజ్య
శ్రీయుక్తుఁడవైన నీకుఁ జెలినై యుంటన్. ౬౧౯

క. నారూపము నాజవ్వన
మారయ మునిపత్నినగుట యర్థామె చెపుమా
నీరజగర్భుని వ్రాఁతలు
ధారుణిలో నేరికైన దప్పునె యకటా ! ౬౨౦

గీ. పదము లొత్తుచుఁ దనమొద్దఁ బవ్వళింపఁ
బర్వ మిద్ది, నేఁడు వ్రతమని పలుకుఁ గాని
మానివరుఁ డొక్క రేయైనఁ గాని మదన
కదన ౬౨౧

క. సతి కెనయగు పతిచే నగు
రతి దలఁపఁగ మిగుల సుఖకరం బగుచుండున్
జతగాని వానిచే నగు
రతి దుఃఖకరంబగు న్సురవ్రజనాథా! ౬౨

క. గౌతమముని రూపముచే
నాతో సరియగునె దేవనాయక! విను మ
చ్చాతుర్యవచనరచనల
కాతతసంతోష మంద నబ్బుఁడె చెపుమా. ౬౩

శా. ఆనందంబున నావిభుం గనను పాకారీ! కృపాకారి నీ
గాన న్నేఁడు దురంతచింత లుడిగెన్ గారాము నాకబ్బె నీ
చాన న్నన్ను వరించు కోర్కులలరన్ సంభోగసంధాయివై
నానాబంధ విచిత్రవైఖరుల నానందాబ్ధిలోఁ దేల్చుచున్. ౬౪

క. శతమన్యుఁడు పతి యని సం
తతఖేదముఁ జెందుచుండ దైవము నాకున్
శతమన్యుని నినుఁ గూరిచి
యతిమోద మొనర్చె నిప్డు డతిచిత్రముగన్. ౬౫

గీ. ఇంద్రుఁడ నటంట కైతవం బింతె' కాని
దర్పకుఁడ వచుఁ దోఁచు సౌందర్య మరయ
శంబరారివి సుమనః కదంబకృతివి
హరిహయుఁడ వౌట సందియం బగునె నాకు. ౬౬

చ మనమున నిన్నుఁ గోరి, కడు మక్కువతోడుత నున్న నాపయిన్
ఘనకృప నీవు వచ్చితివి గావున నీకిఁక విన్నవించెదన్
జనవున జాగుసేయక, వెసన్ మదనాశుగపీడ వీడఁగా
నను రతికేళిఁ దేల్చు సురనాయక! మాటలు వేయు, నేటికిన్. ౬౭

క. అని పల్కు నహల్యం గని
వినయంబున ... మధు ... !

వినుమ నీ వాడిన మాటలు
పనివడి నాపీనులకును బాధువఁ జేసెన్. ౬౨౮

క. తరుణీమణి ! సరసత గల
సరసీరుహనేత్రచెల్మి సంగత మైనన్
బురుషునకు నింతకంటెను
బరమామోదకర మైన భాగ్యము గలదే. ౬౨౯

వ. అను సమయంబున, ౬౩౦

క. ఇరువురకు నింత సేపిటు
గురుధృతు లొప్పునె యటంచు గొబ్బునఁ గోపో
ద్ధురుఁడై మదనుఁ డహల్యా
సురపతులన్ దూలనేసె సుమశరములచేన్. ౬౩౧

వ. అంత నయ్యహల్యాకాంతా శచీకాంతులు పరస్పరసంజనిత ప్రేమా
తిరేక సంభ్రాంతస్వాంతులై గాఢాలింగనంబు లొనర్చుచు, మధురా
ధరసుధాపానంబు లాచరించుచు, నఖదంతక్షతంబులు సేయుచు,లపన
కపోలచుంబనంబులు గావించుచు సంభోగసమయోచిత మృదుమధు
రవచనంబు లాడికొనుచు, రతిరహస్యాది మదనశాస్త్రోక్తప్రకారాం
గీకృత బహువిధవిచిత్ర బంధబంధుర సురతసంజాతానంద విస్మృతశ
రీరు లగుచునుండి, కొంతసేపునకుఁ దెలివిఁ బొంది, మందహాసభాసుర
వదనారవిందులై, కందర్పప్రభావంబునకు విస్మితు లగుచున్నయెడ,
రదప్రభావిజితకుందయు, కచనిచయవిజితమిళిందయు, మందగమన
పరిహాసితగజబృందయు, పురందర సమాగమకృతానందయు నగు
మునిసుందరి సంక్రందనున కిట్లనియె. ౬౩౨

చ. అనిశముఁ బెంపుమీఱుచు మదాత్మనఁ గీల్కొను పంచబాణవే
దన సడలించితీవు కడుధన్యత నొందితి; నింకఁ బాకశా
సన ! నినుఁ బాసి యొక్కనిమిషంబుననన్ నిలు పోపఁజాల నై
నను [illegible] సేయుదున్.

వ. అది యెట్టిదంటేని ? యెఱింగించెద నాకర్ణింపుము. ౬౩౪

ఉ. చూతశరాకృతీ ! బలనిషూదన ! నీవు నేను గూడి యి
ట్లాతతలీల ముచ్చటల నాడుచునుండిన నింతలోపలన్
గౌతమమౌని వచ్చిన నకారణశాపము లిచ్చు నీకు నా
కీతఱి నట్లుగాన దివి కేఁగుము చెచ్చెర నీవు నావుడున్. ౬౩౫

ఉ. కామిని ! నాకు నీపయినఁ గల్గిన కూరిమి నిన్ను వీడఁగా
నామదిఁ దోఁపదైన నొకనాఁటికిఁ దీఱునె నాదుమోహ; మో
కోమలి ! నీవు చెల్పునటు గొబ్బున నేఁగెద నింటి కాముని
గ్రామణి రాకమున్న ననుఁగన్నసహించునె మౌని శాంతుఁడై ౬౩౬

ఆ. వె. అతివ ! యినుము నంటు నగ్నికి సమ్మెట
పెట్లు దగులునట్లు ప్రేమతోడ
నన్నుఁ గదిసియున్న నిన్ను శిక్షించుఁ బో
గౌతముండు కోపకలితుఁ డగుచు ౬౩౭

ఆ. వె. కాన సత్వరంబుగా నింటి కేఁగెద
మగువ నన్ను నెపుడు మఱువకుండు
ముచితమైన వేళ నొగి వత్తు నిటకుమ
త్ప్రాణతుల్య ! ఘనకృపా ! యహల్య! ౬౩౮

వ అని పల్కి, పునఃపునరాలింగనంబు గావించుచు, ప్రణయమధుర వచనంబు లాడుచుఁ గొంత తడ వుండి, యతిసాహసంబునఁ దదనురాగరజ్జువుం దెంపుకొని, నిలింపపతి యహల్యాకాంతను వీడ్కొని యుటజంబు వెలువడి వచ్చునెడ, నతనిముందట గౌతమమునీంద్రుఁ డెదు రేఁగుటయు, మహనీయ తేజోవిరాజితుండును, సురనదీకృతావగాహనుండును, కరకలితగంగోదక కనత్కమండలుండుచు, పింగజటాభారసంగతుండును, పరమతపోధనుండును నగు నమ్మౌనిసింహునిం గాంచి, సురకుంజరుండు భయకంపితాత్ముండై యున్నసమయంబున ౬౩౯

క. కన్నుల నిప్పులు రాలఁగఁ
క్రన్నన సురపతిని జూచి, గౌతముఁ డనియెన్
మన్నింపఁగ నర్హుండవె
మున్నుపలెన్ నీవు సేయు మూర్ఖత దలఁపన్. ౬౪౦
గీ. తప్పుఁ జేసినాఁడ విప్పుడు గావున
లోక మెఱుఁగ శిక్ష నీకుఁ జేతు
ముష్కరుండ వగుట ముష్కహీనుండవై
గర్వ ముడిగి యుండు పర్వతారి! ౬౪౧
గీ. అని శపింప, నింద్రు నండముల్ ధరణిపైఁ
దునిసి రాలె; నంత మునివరుండు
ఱాయఁదఱిగియున్న జాయను గన్గొని,
యధికకోపుఁ డగుచు ననియె నిట్లు ౬౪౨
ఉ. కోకకదీజ నిపు సురకుంజరుఁ గూడి తవాచ్యమా దురా
చార మొనర్చి తీవు మునిజాయలలోపల నిన్నుఁబోలు వా
రేరి? వచింపుమీ? సుగుణహీనవు నిన్ననసేమి గల్గు; నో
నీరజనేత్ర సూరిజననిందితవై తివి; ధాత్రి నయ్యయో! ౬౪౩
ఉ. తోయజగంధి! నీ వోసఁగు తోయము లంటఁగరాదు; గూడి నీ
తో యజనాదికృత్యములు తొల్లిటిభంగి నొనర్పరాదు; ని
న్నే మెడఁ దల్పరాదు; మదికింపుగ నిన్గని పల్కరాదు; నిన్
బాయఁగరాదు దుష్కృతము; భామిని మాటలు వేయు నేటికిన్.
క. సుగుణంబులగని మగనికిఁ
దగుమగువ యటంచు మున్ను దగువారలలోఁ
బొగడొందుచుండి, యిట్టులు
దగనిపనుల్ సేయునీకుఁ దగునే తరుణీ! ౬౪౪
గీ. హాఁకటాక్షంబు గలవారి కవనిలోన
భూరిసరసం... [illegible]

హరి కటాక్షంబు నేఁడు నీ కబ్బెఁ గాన
బహులసంసారబంధంబుఁ బాయు నబల ! ౬౪౬

క. సబలారాతివటంచున్
ప్రబలతపశ్శక్తిగంటి పటుమతిచే ని
న్నబలారాతినిగాఁ జే
సి, బహుస్తుతి గాంతు నే నశేషజ్ఞులచేన్. ౬౪౭

వ. అని పలికి కోపోద్రేకంబున. ౬౪౮

క. భాషింపరాని దుస్తర
దోషముఁ జేసితివి; మిగుల దుర్మతి వగుటన్
యోషా ! నీ విచ్చోటన్
పాషాణమ వగుదు వుండు బహువత్సరముల్. ౬౪౯

చ అనిశపియించి, క్రమ్మఱ నహల్యను గాంచి మునీంద్రుఁ డాత్మలోఁ
గనికరమూని, రామ ! విను, కంజహితాన్వయవార్థిసోముఁ డ
త్యనఘుఁడు రామచంద్రుఁడు దయాత్ముఁడు నిన్గన నేఁగుదెంచు ని
వ్వని కెపుడప్డు శాపము నివారితమౌ తదనుగ్రహంబునన్. ౬౫౦

క. నీలోపల బెగడకు మన
నీలోపలమై యహల్య నేలంబడెఁ ద
త్కాలమున గౌతముఁడు హిమ
శైలాగ్రంబునకుఁ దపము సలుపఁగఁ జనియెన్. ౬౫౧

వ. అంత. ౬౫౨

చ. అమరులపాలికేఁగి, దివిజాధిపుఁ డిట్లను; వేల్పులార ! గౌ
తముఁడు మహోగ్రమౌ తపముఁ దానొనరింపఁగఁ దత్తపంబునే
నమరహితంబుగాఁ జెఱుప నాత్మఁ దలంచుచు నేఁగి, తన్మనః
కమలము నొంప, నన్విఫలుగా శపియించె మునీంద్రుఁ డల్కఛేన్.

గీ. అటుశపించిన నాదర్ప మడఁగె మీరు
విఫలుఁడగు నన్ను సఫలుఁ గావింపుఁ డన్న

సురలు పితృదేవతల నెల్లఁ జూచి, హరికి
నెలమి మేషాండములు గూర్పవలయు మీరు. ౬౫౪

క. అన విని పితరులు సురలం
గని, మీరలు సెప్పినట్లు గావింతుము మే
మని, మేషాధిపు కార్యం
బని మేషాండములు దెచ్చి, యదికిరి హరికిన్. ౬౫౫

వ. నాఁట నుండి యింద్రుండు మేషాండుండయ్యె; నిది గౌతమాశ్రమం, బిప్పటంబునఁ బతిదత్తశాపతప్తమానసయగు సహల్యశిలారూపధారిణియై భవద్దర్శనంబుఁ గోరియున్నది; గావున రఘువరా! యచ్చోటికి నీ వరిగి, యమ్మునిసతిని శాపరహితం జేయుమని పల్కిన, వల్లెయని కృపాసాంద్రుండగు రామచంద్రుండు విశ్వామిత్ర లక్ష్మణ సహితుండగుచుఁ దదాశ్రమంబుఁ బ్రవేశించె; నయ్యవసరంబున. ౬౫౬

చ. వనజదళాక్షుఁడైన రఘువర్యునిరాక విహీనపాపయై,
యనుపమభాగ్యయై, నిజశిలాకృతి వీడి, నిరస్తఖేదయై,
తనను మేనికాంతులను దద్వన మెల్ల వెలుంగఁ జేయుచున్
గనకశలాకయో యనఁగఁ గన్పడె గౌతమకాంత వింతగాన్ ౬౫౭

సీ. రామలక్ష్మణులంత రయమునఁ బావని
యగు నా యహల్యపాదాబ్జములకు
మ్రొక్కిన వారల ముదముతో దీవించి,
పలిపల్కు వాక్యముల్ భావమునను
దలఁచుచు, నతిథిసత్కారంబు గావించి,
సన్నుతించుచునుండ, సరగ సురలు
కుసుమవర్షము వేడ్కఁ గురియించి; రట దివ్య
భూరిభేరీస్వనంబులు సెలంగె;

గీ. సకల దివిజులు సనుదెంచి సాధురీతి
నయ్యహల్యను వినుతించి యరిగి; రంత
గౌతముఁడు వచ్చి, తనభార్యఁ గదిసి, మదిని
సమ్మదంబున నారాముఁ సన్నుతించె ౬౫౮

వ. అనంతరంబ, బ్రహ్మర్షి వరుండగు గౌతమమునీంద్రుండుఁ దనకు రామ భద్రుండు సేయు పూజలంగైకొని, దీవన లొసంగి, తపఃపవిత్రచరిత్ర కళత్రసమేతుండై తపోవనంబున కరిగినఁ, గౌశికుండును రామ లక్ష్మణసహితుండై మిథిలానగరంబుఁ జొచ్చి, నానాదేశాధీశ్వరాధి ష్ఠితంబును, హోమధూమావృతంబును, సమిత్కుశాదిసవనోపకరణ యుక్తంబును మహామునివిరాజితంబును, నిగమవచోనినదబంధురం బును, దధిఘృత క్షీరపూరితసువర్ణ కలశాభిరామంబును, కాంచన యూపశోభితంబును, నగు జనకాధ్వరప్రదేశంబు ప్రవేశించె నప్పుడు.

గీ. జనక నృపుఁడు శతానంద సహితుఁ డగుచు
నర్ఘ్యపాద్యంబు లామోద మతిశయిల్లఁ
గొనుచు గాధేయుఁ జూడఁగాఁ గోరి, యెదుట
వచ్చె తనుఁ జూచు వారలు మెచ్చుచుండ. ౬౬౦

వ. అట్లువచ్చి, విశ్వామిత్రునిం బూజించి, నమస్కారపూర్వకంబుగాఁ గుశలం బడిగి వినుతించుచున్నయెడఁ గౌశికుండును జనకమహీపా లున కాశీర్వచనంబు లొసంగి, మృదుమధురవచనంబుల నిట్లనియె.

క. అలఘుగుణ ! నీకు నీ వా
రలకును సేమంబె? యధ్వరము శుభదంబై
విలసిల్లునె ? జనతతి ని
చ్చలు మెచ్చఁగ ధర్మసరణిఁ జరియింతె? నృపా ! ౬౬౧

చ. అని జనకుండు వల్కె వినయంబునఁ దాపసవర్యపంకజా
సననిభ ! భానుతేజ ! సురసంచయసన్నుత ? నిన్నుఁగంటి; నా
మనము సెలంగె ! నో భువనమాన్య ! భవత్కృప నెల్ల భద్రముల్
దనరుచునుండె నేఁడు కడు ధన్యుఁడనైతి నృపాలకోటిలోన్. ౬౬౨

క. నా సవనముఁ గనుఁగొనఁగా
నోసంయమివర్య ! మునిజనోపేతుఁడవై
వాసిగ నీ వరుదెంచుట
భాసురమతి సన్ముని ! నాదు భాగ్యము గాదే. ౬౬౪

క. పదిరెండు దినము లిట సం
మద మలరఁగ నుండుఁ డిటకు మఘభాగము లిం
పొదవఁగఁ గైకొనవచ్చిన
త్రిదశులఁ గనుఁగొనుఁడు; మునివరేణ్యులు నీవున్. ౬౬౭

వ. అని బహుప్రకారంబుల వినుతించి, రామలక్ష్మణులంజూచి, విశ్వామిత్రున కిట్లనియె. ౬౬౬

క. ఈరాజకుమారులు సుకు
మారులు కందర్పభాసమానాకారుల్
నారాచనిషంగధను
ర్ధారులు పదచారు లమలతామరసాక్షుల్. ౬౬౭

క. వారణ గమను లుదారులు
నారాయణసములు మేరునగవరధీరుల్
శూరులు వీ రెవ్వారలు ?
భూరి కృప నెఱియఁ జెప్పు బుధజనవినుతా ! ౬౬౮

క. అన విని, రాముఁడు లక్ష్మణుఁ
డనఁదగు వీ రన్నదమ్ము లర్కకులేంద్రుల్
దనుజానేకవిభేదను
లనఘాత్ములు దాశరథు లహఃపతితేజుల్. ౬౬౯

వ అని పలికి, విశ్వామిత్రుండు మఱియు నిట్లనియె. ౬౭౦

సీ. నావెంట వచ్చి యీ నరనాథనందనుల్
సిద్ధాశ్రమమునఁ బ్రసిద్ధసత్వ
తాటకఁ బరిమార్చి దానవాఢ్య సుబాహు
రణరంగమునఁ గూల్చి రభసమొదవ
నాయజ్ఞసంరక్షణము సేసి వెస నహ
ల్యాశాప మెలమిఁ దొలంగఁ జేసి
బాగు మీఱఁగ నహల్యాగౌతములఁ గూర్చి
ఇట్లు మీ యింటికి వచ్చిరి.

తే. తంబగుచునున్న శంభుచాపంబుఁ జూడ
వచ్చినారము; వీర లవార్యబలులు
దలఁప వీరల కెట నసాధ్యంబులేదు
జగము బ్రోవంగఁ బుట్టి రీచతురు లనఘ ! ౬౭౧

వ. అనిన విని గౌతమనందనుండగు శతానందుం డానందసాంద్రుండై
కౌశికమునీంద్రున కిట్లనియె. ౬౭౨

క. పాతకహరుఁడగు రామ
క్ష్మాతలవిభుఁ దెచ్చి, నాదుజననిన్ శాపా
పేత నొనర్చియుఁ గ్రమ్మఱ
గౌతముతోఁ గూర్చి తీవు గాధేయమునీ ! ౬౭3

క. నీ కరుణవలన మునివర !
మాకుల మున్నతి వహించె మాన్యతవలనన్
నీకు సరివచ్చువా రీ
లోకమునం గలరె ? విబుధలోకస్తుత్యా ! ౬౭౪

వ. అని ప్రశంసించి రామచంద్రుం జూచి యిట్లనియె. ౬౭౫

క. వనజాక్ష ! నాదు జననీ
జనకులకును గలిగె మరల సంగతి, నీద
ర్శనమున మాకుల మున్నతిఁ
గనె మీకు శుభంబు లెల్లఁగావుత మింకన్. ౬౭౬

వ. అని యాశీర్వదించి, విశ్వామిత్రచరిత్రంబు వినిపింతు ననుమని యిట్ల
నియె. ౬౭౭

క. కుశ భవ భవునకుఁ బుట్టెను
కుశుఁ డాకుశునకు జనించెఁ గుశనాభుండా
కుశనాభుఁడు గాధిఁ గనెన్
విశదాత్ముం డతఁడు గనియె విశ్వామిత్రున్. ౬౭౮

వ. అంత. ౬౭౯

క. చతురంగబలయుతుండై
సతతశ్రీయుక్తి నమిత శతవత్సరముల్
క్షితితల మంతయు మహిమో
న్నతి విశ్వామిత్రుఁ డేలె నయమలరంగన్. ౬౮౦

గీ. ఇట్లు సకలమహీరాజ్యమేలుచుండి
యెలమి నక్షౌహిణీసేన గొలువ గ్రామ
నగరరాష్ట్రాశ్రమ సరిద్వనంబులందుఁ
దిమ్మరుచుఁ గౌశికుం డొక్కదినమునందు. ౬౮౧

సీ. గంధ బంధుర పుష్ప కమనీయఫలయుక్త
వివిధ పాదపజాల విలసితంబు
గతవిరోధ మదేభ కంఠీరవేంద్రగో
వ్యాఘ్రాది జంతుసమావృతంబు
కీర కోకిల కేకి పారావత మరాళ
శారికాది విరావసంకులంబు
గరుడ చారణ సిద్ధ గంధర్వ కిన్నర
యక్ష రక్షస్సమూహాంచితంబు

గీ. కైరవాంబుజ కలిత కాసారయుతము
శమదమాన్వితఫలమూలసలిలపర్ణ
పవనభక్షణదక్ష తపఃప్రవీణ
మౌనియైన వసిష్ఠాశ్రమమున కరిగె. ౬౮౨

చ. అరిగి వసిష్ఠమౌనికి రయంబున మ్రొక్కిన సమ్మహాత్ముఁ డా
దరణముతోడ దీవనలు తద్దయొసంగి కుశాసనంబునం
దిరవుగ నుండఁబంచి, మది కింపుగఁ బూజలొనర్చి మూలముల్
సరసఫలంబు లీఁగఁగొని, సంయమితో నిటు కౌశికుం డనెన్. ౬౮౩

గీ. మీకు మీవారలకు సేమమే ? మునీంద్ర !
యతిథిపూజాగ్నిహోత్ర క్రియాతపములుఁ
బరఁగునేయన్న సకలంబు భద్రమనుచు
నతనిఁ జూచి వసిష్ఠుఁ డిట్లనియె మరల. ౬౮౪

క. భృత్యులఁ బ్రోచెదె? దుష్టుల
నిత్యము శిక్షింతె? రాజ నీతిజ్ఞుఁడవై
సత్యము ధర్మముఁ దప్పక
క్షిత్యవనముఁ జేసెదే? విశేషప్రాభవ? ౬౮౪

క. నీవును నీనందనులును
నీవారును సుఖులె? మఱియు నీసేనలకున్
భావుకమే? వచియింపుము
పావనగుణకీర్తిసాంద్ర! పార్థివచంద్రా! ౬౮౬

గీ. అనుడు, మాకందఱకు శుభంబగు నటన్న
విని, వసిష్ఠుండు నీకేను విందుఁజేతు
ననుచు గాధేయు నునిచి, నెమ్మనమునందుఁ
దలఁచి, సురభిని రప్పించి, దానికనియె. ౬౮౭

క. ఈనరపాలున కీతని
సేనలకున్ గూర్మివిందు సేయఁగవలయున్
మానుగ నీ విపు డన్నము
పానీయాదులు సృజింపు పటురభసమునన్. ౬౮౮

గీ. అనుడు నక్కామగవి, షడ్రసాన్వితంబు
లైన యన్నోదకంబులు నాజ్యములును
దధి మధు క్షీరకుల్య లుదారసూప
వివిధశాకాదులు సృజించె వేడుకలర. ౬౮౯

వ. అట్లు సృజించిన, ౬౯౦

క. సకల బలాన్వితుఁడై కౌ
శిక నృపుఁ డతితృప్తిగా భుజించి విచిత్రా
త్మకుఁడై మునివరుఁ గని, తా
వక సత్కృతి కెలమిఁ గన్నవాఁడ నటంచున్. ౬౯౧

వ. మఱియొక్క విన్నపంబు గావించెద నవధరింపుఁడని యిట్లనియె. ౬౯౨

సీ. లక్షహయంబుల లక్షగజంబుల
దశశతలక్షరత్నముల మఱియు
లక్షగోవుల నీకు నీక్షణ మిచ్చెద
నీగోవు నాకిమ్ము యిమ్ము మీఱి
ననుడు, నమ్మునివర్యుఁ డాత్మలోఁ జింతించి
యతనితో నిట్లనె; నయ్య వినుము
మజ్జీవితంబును మన్నిధానంబును
మత్ప్రాణధర్మముల్ మత్తపంబు

గీ. మామకీనధనంబు లీ హోమధేను
వుగఁ దలంచెదఁ గాన ముజ్జగము లీవు
నాకు నిచ్చిన దీని నే నీకు నొసఁగఁ
జాల ననుఁడు నతండు రుట్సహితుఁడగుచు. ౬౩

గీ. బలిమిచే దానిఁ బట్టించి భటులవలనఁ
గొంచుఁ బోవుచునుండ నగ్గోవు నాకు
నేలికైన వసిష్ఠ మునీంద్రుఁ డిట్లు
న న్నుపేక్షించునే యని ఖిన్నయగుచు. ౬౪

క. అటుపోవక తనుఁ గొని చను
భటశతముల చరణహతులఁ బడఁదన్ని మహో
త్కటరయమునఁ బఱతెంచుచు
జటివర్యుని చెంత నిలిచి చన నిట్లనియెన్. ౬౫

చ. జనపతి భృత్యవర్గము భుజాబలగర్వము లొప్ప న న్ననా
థనుబలెఁ గొంచుఁ బోవఁగ వృథామతిఁ గాంచెదవయ్య? నీకు నే
మును పొక కీడొనర్చితినొ? బ్రోవ విపద్దశఁ జెంద నన్ను నే
లినదొర వయ్య నీ విటువలెన్ బరపేక్షుఁడ వౌట ధర్మమే? ౬౬

వ. అనిన వశిష్ఠుం డాధేనువున కిట్లనియె. ౬౭

క. అపకృతి నా కొనరింపవు
విపదీతాత్ముండ నగుచు విడువను నిన్నీ

నృపుఁడు కడు బల్మిఁ గొని చన
నపకారము సేయలేక యడలుచు నుంటిన్. ౧౯౮

గీ. ఈతఁ డక్షౌహిణీబలోపేతుఁ డధిక
విక్రమాన్వితుఁ డఖిలభూచక్రభర్త
క్షత్రియోత్తముఁ డీతని సంగరమునఁ
బూని గెలువంగ బ్రహ్మకునైన వశమె? ౧౯౯

వ. అనిన విని. ౨౦౦

క. సురభి యిటు లనియె నమ్ముని
వరుఁ గని, చింతింపనేల వరమతివి సురా
సురల కజేయుఁడ విల నె
వ్వరు నిన్ను జయింపఁగల రవార్యస్థైర్యా! ౨౦౧

క. అరయు నృపబలముకంటెను
గర మెక్కుడు విప్రబలము; గావున, నీ భూ
వరుఁ డెంత? నన్నుఁ బనుపుము
పరిమార్చెద నితనిసకలబలములఁ వేగన్. ౨౦౨

క. అన విని కనలుచు సురభిం
గని ముని యిట్లనియె; నీవు ఘనకింకరులన్
జనియింపఁజేసి గ్రక్కున
వినిహతముగఁ జేయు మీనివివిధబలంబున్. ౨౦౩

క. అనిన విని కామధేనువు
గనలుచు హుంకృతి నొనర్పఁగాఁ దన్నాదం
బున నిశితాయుధహస్తుల్
జనియించి నృపాలుబలముఁ జదుపుచునున్నన్. ౨౦౪

క. ఆభీరభటులఁ గన్గొని
యావిశ్వామిత్రుఁ డుగ్రుఁడై శౌర్యమునన్
బావకసదృశాస్త్రంబుల
చే వారల నెల్ల [illegible] ౨౦౫

గీ. చండవీక్షణుఁడై వసిష్ఠుండు హోమ
ధేనువును జూడఁగా రోషదీప్త యగుచుఁ
బూని హుంకార మొనరింప దానివలనఁ
బుట్టి రతితేజులైన కాంభోజభటులు. ౨౦౬

వః మఱియును. ౨౦౭

గీ. పరమగవ్యంగరోమకూపములయందు
మ్లేచ్ఛ యవన కిరాత పుళింద శబర
వీరు లుదయించి భీషణాకారులగుచుఁ
గౌశికబలంబుఁ జక్కాడఁ గదిసి యంత. ౨౦౮

క. పరశు కరవాలపట్టిస
శరతోమర ముద్గరాదిసాధనములచే
కరితురగరథపదాతుల
ధరఁ గూల్చిరి నిజభుజోగ్రదర్పము లొప్పన్ ౨౦౯

వ. అయ్యవసరంబున. ౨౧౦

క. శతసంఖ్య నమరు కౌశిక
సుతులు వసిష్ఠమునిఁ దాఁకఁ జూచి, యమర్షా
న్వితమతిమై యతఁ డందఱ
హతులం గావించె హుంక్రియారవములచేన్. ౨౧౧

వ. ఇవ్విధంబున. ౨౧౨

సీ. సైన్యముల్పుత్త్రులు సమసిన దుఃఖితుం
డై కౌశికుఁడు నిస్పృహాత్ముఁ డగుచు
నాత్మజు నొకని రాజ్యమునందు నియమించి
హిమశైలతటమున కేఁగి యచట
శంకరుఁ గూర్చి నిష్ఠను దపం బొనరింప
వరదుఁడై యామహేశ్వరుఁడు వచ్చి
మనుజేంద్ర నీతపంబునకు మెచ్చినవాఁడ
నిజముగను వరమిద్దు నైన నిత్తు

గీ. ననిన భర్గుని కతిభక్తి వినతిఁజేసి
దేవ ! తమిదీఱ వరమిచ్చితేని సాంగ
ముగ ధనుర్వేదమును శస్త్రములు మహాస్త్ర
సమితి నిమ్మనఁ గృప నిచ్చి శంభుఁ డరిగె. ౭౧౩

వ. ఇట్లు లబ్ధమనోరథుండై విశ్వామిత్రుండు పరమోత్సాహంబున వసిష్ఠాశ్రమంబునకుంజని, యాగ్నేయబాణంబులు ప్రయోగించినఁ దత్కీలాజాలంబుల నవ్వనంబు దగ్ధంబగుచునుండ సంపన్న మునిజన పశుపక్షిమృగాది సకలప్రాణినికరంబులు భీతంబులై తిరుగుడు పడం జూచి వసిష్ఠమునీంద్రుండతిప్రతాపంబున దండధర మహోద్దండదండంబుఁబోని బ్రహ్మదండంబు భుజదండంబునం దమర్చుకొని, సత్వరంబునం జనుదెంచి, కౌశికు నవలోకించి యిట్లనియె. ౭౧౪

గీ. ఓరి కౌశిక ! కులహీన ! యున్మదమున
వచ్చి మునిజనవాసమౌ వనము నేల
గాల్పఁజూచెద పింక నీకల్మషమున
నాశమొందెదు నాపల్కు నమ్ము నమ్ము. ౭౧౫

చ. నిను బలహీనుగా నెఱుఁగు నీబల మెక్కడ, నీకులంబు గ
న్నన నశియింపఁజేయఁదగు నాబల మెక్కడ, తారతమ్యముల్
గనియెనుగాక తొల్త నిదెగాంచుము నైరిన శేంద్రసైన్యభం
జననిపుణప్రభానికరచండ మఖండము బ్రహ్మదండమున్. ౭౧౬

మ. అని పల్కన్ బటురోష దీప్తుఁడయి విశ్వామిత్రుఁ డుగ్రప్రభా
కనదగ్నిప్రదరంబు కీల లడరంగా నేయఁ గోపించి, య
మ్ముని హుంకారముచేసి, యాఘనశరమ్మున్ బ్రహ్మదండంబుచే
త నివారించె నిజాశ్రమస్థమునిసంతానంబు మోదింపఁగన్. ౭౧౭

వ. అట్లు వారించినఁ గ్రోధతామ్రాక్షుండై విశ్వామిత్రుండు వెండియు నైంద్రవారుణ రౌద్ర పాశుపతాద్యనేక దివ్యాస్త్రంబు లతనిపయిం బ్రయోగించిన నా బ్రహ్మర్షి వమ్ము డయ్యాస్త్రపరంపరల నశ్రమం

బున బ్రహ్మదండంబుచేత ఖండించి, బ్రహ్మతేజోవిరాజితుండై రెం
డవసూర్యుండునుంబోలెఁ గనుపట్టియున్నంత. ౭౧౮

సీ. అలిగి కౌశికుఁడు బ్రహ్మాస్త్రంబు సంధించి
సకలలోకంబులు సంచలింప
బ్రహ్మర్షివర్యునిపై నేయఁ బటుతర
జ్వాలాకరాళమై సాంద్రధూమ
కలితమై విస్ఫులింగవ్రాతజనకమై
ఘోరమై పవికోటిఘోషమగుచు
ననిలవేగంబున నయ్యస్త్ర మేతెంచి
బ్రహ్మదండముదాకఁ బరఁగ దానిఁ

గీ. బట్టుకొని సంయమీంద్రుండు ప్రౌఢి మ్రింగి
బ్రహ్మతేజంబు హెచ్చింపఁ బావకాను
గములు తత్కాయరోమకూపములు వెడలి
గాధిజుని మేనువ్రచ్చి తద్గర్వ మడఁచె. ౭౧౯

చ. అపుడు వసిష్ఠునిం గని మహామును లెల్ల నుతించి, నాథ ! నీ
తపమును దేజ మద్భుతవిధంబులు గావునఁ గౌశికుండు నీ
యపరిమితప్రభావమున నార్తినిఁజెంది తొలంగె; నింక నీ
వుపశమ మొందుమయ్య యన, నున్నతశాంతి వహించె మౌనియున్

క. పిమ్మట గాధేయుఁడు ద
ర్ప మ్మింతయులేక లజ్జపడి బెగడుచుఁ జి
త్తమ్మున నిటు దలఁచెను జి
త్రమ్మమ్యోదు నిమ్మునిప్రతాపం బరయన్. ౭౨౧

క. భవ్యాత్ముఁ డీతఁడెటు జే
తవ్యుండగు నితని బ్రహ్మదండమె విబుధ
స్తవ్యములై దగు మామక
దివ్యాస్త్రచయంబు లెల్లఁ ద్రెగటార్చె నహో ! ౭౨౨

వ. అని పెక్కుభంగులఁ జింతిల్లుచు. ౨౧౩

గీ. బ్రహ్మబలము క్షత్రబలముకంటెను బెద్ద
గాన బ్రహ్మబలముఁబూని యేను
జగతిలో వసిష్ఠసంయమికైవడి
నలరువాఁడ ననుచు నాక్షణమున. ౨౧౪

క. కుశవంశజుండు దక్షిణ
దిశకుం జని యచటఁ గులసతీయుతుఁ డగుచున్
భృశతప మొనరించె శర
ద్దశశతకము మూలఫలవితానాశనుఁడై. ౨౧౫

క. నందనులఁ గాంచె ముప్వుర
నందముగా గాధిసూనుఁ డాలోన హవి
ష్యందుని ఘనుఁడైన మధు
ష్యందుని వరవిక్రమాఢ్యుఁడగు దృఢనేత్రున్. ౨౧౬

వ. అంత. ౨౧౭

క. రాజీవ గర్భుఁ డట క
వ్యాజకృపన్ వచ్చి, రాజవర! నీతప మె
చ్చె జగము నిండె నీవిఁక
రాజర్షివి గమ్మటంచు రయమునఁ జనియెన్. ౨౧౮

గీ. చనినఁ గౌశికుండు చాలఁ జింతిల్లుచుఁ
గలిత నిష్ఠతోడ సలుపు మత్త
పంబు రిత్తయయ్యె బ్రహ్మర్షి గాక రా
జర్షి గాక మెలఁగఁ జనునె నాకు ౨౧౯

క. మనమునఁ గోరిన కోర్కెక
పనివడి సిద్ధింపకున్నఁ బ్రమదము గలదే
యని కడుఁ ఘోరంబగు తప
మనుపమముగ సల్పఁ దొడఁగె నాసనమునన్. ౨౩౦

సీ. గుణగణ్యుఁ డిక్ష్వాకుకులజుండగు త్రిశంకుఁ
డను రాజు తనకుఁ గాయంబుతోడ
స్వర్గంబునకు నేఁగఁ జనునట్టి యధ్వరం
బొనరింప మానసంబునఁ దలంచి
మునివర్యుఁడగు వసిష్ఠునిఁ జూచి గురునాథ
యిమ్మేనితోడ నాకమ్మొఁ జెందఁ
దగు మఘం బిఁక నాకు దయఁజేయవలయు మీ
రనవుడు నీకు ని_త్తనువుతోడఁ
గీ. ద్రిదివమున కేఁగరాదు ధాత్రీతలేంద్ర
యన వసిష్ఠాత్మభవు లున్నయటకు నరిగి
వినతిఁజేసి వసిష్ఠోక్తవిధముఁ దెల్పి
యెలమి వారలతో నాతఁ డిట్టు లనియె. ౨౩౧
క. ఈమేనితోడ నిర్జర
ధామమునకు నరుగ మఘముఁ దగఁ జేయుఁడు నా
కో మానులార ! గురువులె
భూమీశుల కరయ నిఖిల పురుషార్థకరుల్. ౨౩౨
వ అనవుడు. ౨౩౩
చ. నరవర ! యవ్వసిష్ఠమునినాథుని సమ్మతిలేని కార్య మి
ద్ధర నొనరింప మాకు నుచితంబగునే ? కుమనీషఁ బూని నీ
వరయవుగాక; యిప్పని శుభావహమే ? పలుమాట లేల ? చ
స్కరమిది యన్నఁ గొంకక త్రిశంకుఁడు వెంకిియు వారి కిట్లనెన్.
క. అహహా ! మాకాశ్రితులై
బహుకాలమునుండి మీరు బ్రదికియు నిట మ
ద్విహితంబు గూర్పఁదలఁపరు
కుహనాగురు లేల మాకుఁ ? గుత్సితులారా ! ౨౩౪
క. అన్యులచే నేఁ గోరిన
మన్యువ్వు జేయించుకొందు; మహి మీకంటెన్

మాన్యులు లేరే? యనుడు స
మన్యువు లగుచున్ వసిష్ఠ మానికుమారుల్ ౭౩౬

క. నీతి విసర్జించితి వీక
మాతంగుఁడ వగు మటన్న మాతంగత్వం
బే తెంచి యావరింపఁగ
మాతంగుండై త్రిశంకు మహీవరుఁ డంతన్. ౭౩౭

సీ. కాలిన పెనుమ్రాను కైవడిఁ దేజోవి
హీనమౌ నల్లని మేను గల్గి
కార్ష్ణ్యమై మాసిన కట్టుఁ బుట్టము గల్గి
యరుణవర్ణోత్తరీయంబు గల్గి
కంకణాద్యాయసాలంకారములు గల్గి
విరియఁబాఱిన గుజ్జుకురులు గల్గి
యవిదితార్థంబులై యమరు భాషలు గల్గి
శ్రవణ యోగ్యముగాని స్వరము గలిగి

గీ. ఘనతరామోఘమోఘకాకలితదండ
మొకటి గైకొని ధరణిపై నునుచుకొనుచు
శంబళీ శంబళీ యంచు జనుల డాసి
యెడ యెడఁ బోవు చందంబ నడఁగుచుండె. ౭౩౮

క. ఆ నరపాలునిఁ గనుఁగొని
నానామాత్యాదిహితజనంబులు దరికిన్
రానీయకున్న నతఁ డవ
మానము చేఁ గౌశికాశ్రమమునకుఁ జనియెన్. ౭౩౯

క. చన నతని నెఱిఁగి కౌశికుఁ
డనియె నయోధ్యాధినాథుఁడగు నీ వెబ్భం
గిని మాలఁడవై తనవుకుఁ
దన శాపవిధంబు చెప్పి దండం బిడుచున్. ౭౪౦

వ. ఇట్లనియె. ౨౪౧

సీ. అనఘాత్మ నా కిష్టమైనట్టి యధ్వరం
బెలమితో నీవు చేయింపవలయుఁ
బెక్కుదానంబులు పెక్కుధర్మంబులు
పెక్కుయాగంబులు ప్రియముతోడఁ
గావించితిని; మున్ను కలలోననైనను
సత్యంబు దప్పను; సాధుభక్తి
గురు పూజనముఁజేతు; గురుకృప నాపైని
లేకుంట సవనంబుగాక యుండె

గీ. మఱియు దైవవశంబున మనుజులెల్లఁ
బరిభవించుచునుండి రిప్పట్టునందు
నమ్మియుంటిని నిన్ను దైవమ్ముగాఁగ
నన్ను రక్షించు గాధేయ! నతవిధేయ! ౨౪౨

వ. అనిన సంతోషించి కౌశికుం డిట్లనియె. ౨౪౩

గీ. ధరణినాయక నీవు మోదముననుండు
సకల మునులను బిలిపించి సవన మిచట
సరగఁ జేయించి, నీమాట సత్యమగుచుఁ
బొసఁగ నిమ్మేనితో నిన్నుఁ బుత్తు దివికి. ౨౪౪

గీ. అనుచుఁ దనశిష్యులంజూచి యఖిలమునుల
ఋత్విజులఁ గొంచుఁ జనుడెందు సత్వరముగ
ధర్మమూర్తి త్రిశంకుఁ డీతని కభీష్ట
మైన యాగము మనము చేయంగవలయు. ౨౪౫

ఉ. అనినన్ వా రటులేఁగి వచ్చి, కుశవంశాధీశ! నీపంపునన్
జని ఋత్విక్కుల నెల్లఁ దెచ్చితిమి నిశ్శంకన్ వసిష్ఠాశ్రమం
బు నివాసంబుగనున్న తాపసజనంబు ల్రాకయున్నారు గి
న్కను వాసిష్ఠులు నిన్ను [illegible] ల్లంబుగన్.

సీ. అహహా ! మాలఁడు సోమయాజియై దగునఁట !
యతనికి భూజాని యాజకుఁడఁట !
యాజన్నమునఁ బ్రీతి భోజనంబులు చేయ
వసుమతీనిర్జరుల్ వచ్చెదరఁట !
చండాలమఘమున సవభాగములకు న
శేషదిక్పతులు వేంచేయుదురఁట !
తనపుణ్యమహిమ మాకంగుండు మేనితో
నమరలోకమునకు నరిగెడునఁట !

గీ. వినఁగ నత్యద్భుతంబిది యనివసిష్ఠ
సుతులు పల్కఁన, వినుచు నచ్చోటనున్న
మునివరేణ్యులు మేము రా మని వచించి
రనిన సక్రోధుఁడై యిట్టు లనియె నతఁడు. ౨౪౮

చ. అమరనుతోగ్రనిష్ఠఁ జెలువారఁ దపం బొనరించు నన్ను న
క్రమముగ నిందసేయు నఘకర్ములు ఘోరసురాపులై శ్వమాం
సముఁ దినుచుండనిమ్ము పరుషంబులు నన్నటు పల్కినట్టి దు
ర్దముఁడు నిషాదుఁడై యెపుడు ధారుణిలోనఁ జరింపని మ్మనెన్. ౨౪౯

వ అనిపలికినఁ దనసమీపంబున నున్న మునులం జూచి యిట్లనియె.

క. మనమున నెన్నఁ ద్రిశంకుం
డనఘుఁడు సత్యప్రతిజ్ఞుఁ డధ్వరములు పె
క్కొనరించినట్టి ఘనుఁ డి
జ్జనవిభుహితమఘము మనము సలుపఁగవలయున్. ౨౫౦

వ. అనిన విని మునివరులు దమలోన. ౨౫౧

క. ఈపని కాదన నీతఁడు
కోపానలదీప్తుఁడగుచుఁ గొనుఁడని మనకున్
శాపంబు లిచ్చుఁ గావున
నోపిక నొనరింత మిమ్మహోన్నతమఘమున్. ౨౫౨

గీ. అని విచారించి వార లా యధ్వరమున
నుచితకర్మంబు లొనరించుచుండఁ గౌశి
కుండు యాజకుఁడై వేల్చుచుండి తగిన
సమయ మరుదేరఁగా మహోత్సాహుఁడగుచు. ౭౫౩

క. అమరుల నెల్ల హవిర్భా
గములు గొనన్ బొరిదిఁ బిల్వ ఖచరులు తత నా
దములన్ రా మని పలుకఁగ
సమధికరోషుఁడ య్యి గాధిసంభవుఁడు వడిన్. ౭౫౪

సీ. వరకుశపూతమౌ కరమున స్రువ మెత్తి
మనుజేంద్ర మత్తపోమహిమఁ గనుము
నిను నిప్పుడే నాకమున కేఁగఁజేసెద
నని పల్కి, నే బాల్య మాదిగాఁగఁ
బరమనిష్ఠోగ్రతపంబు చేసితి నేని
నావాగ్బలంబున దేవలోక
మునకు నిమ్మేనితోఁ జనుము మహీపాల
యనుచు నన్నరనాథుఁ డమరపురికి

గీ. నరుగ సురవరుఁ డతని మహాగ్రహమునఁ
గాంచి, చండాల ! వేగఁ బొమ్మంచుఁ ద్రోయఁ
గావవే కౌశికమునీంద్ర ! కరుణ నన్ను
ననుచుఁ దలక్రిందుగాఁ బడునవసరమున. ౭౫౫

చ. శరణము వేఁడుచుండిన త్రిశంకునిఁ గన్గొని కౌశికుండు సా
దరమతియై నరేంద్ర ! యిఁకఁ ద్రాసము మానుము తారకాపథాం
తరమున నిల్వు మంచు విదితంబుగ నిల్పి నిజప్రతిజ్ఞ యి
ద్ధరణి యథార్థమై దనర దక్షిణభాగముఁ జూచి యచ్చటన్. ౭౫౬

క. శతమన్యుతోడ జోడన
క్షితిపతి కొక దివము వెస సృజించుటఁ దారా
తతులన్ ఘనతర తేజో
న్వితులగు సప్తర్షివరుల నిర్మించి తగన్. ౭౫౭

క. వేల్పులకు మాఱువేల్పుల
వేల్పులఁజేసికొని మాఱు వేల్పులఁజేసిన్
గల్పింతు ననుచు నుండఁగ
వేల్పులు మును లేఁగుదెంచి వినయోక్తులచేన్. ౨౫౮

క. గురుశాపవంచితుండై
కరమరుదుగ మాలఁ డయ్యెఁ గావున నితఁ డీ
సురపురి నుండఁగ నర్హుఁడె
పరికింపుము మౌనివర్య! పావనచర్యా! ౨౫౯

వ. అనిన విశ్వామిత్రుం డిట్లనియె. ౨౬౦

క. ఈ నరవరు సశరీరుం
గా నాకమునందు నిలుపఁ గలవాఁడ నటం
చే నందఱు వినఁ బల్కితిఁ
గాన మదీయోక్తి నిజముగా నిర్వాహన్. ౨౬౧

శా. ఏ కల్పించిన నాకమందు ప్రమదం బేపారఁగాఁ దారకా
నీకాభ్యంతరసీమ నూర్ధ్వపదవిన్ నిర్నిద్రుఁడై యీతఁ డ
స్తోకప్రాభవుఁడై యధోగతశిరస్కుండై యిరేడైన యీ
లోకంబుల్ గల యన్నియేఁడులు సుశీలుండై సుఖంబుండెడున్. ౨౬౨

గీ. అనిన నతఁ డట్లులుండుట కాత్మలోన
ననుమతించుచుఁ దదనుగ్రహంబుఁ బొగడి
యమ్మహాత్ముని వీడ్కొని హర్ష మెసఁగ
మునులు సురలు నిజస్థానములకుఁ జనిరి. ౨౬౩

వ. అంత. ౨౬౪

గీ. అనఘుఁ డాకౌశికుండు నిజాశ్రమస్థ
మానులను గాంచి యిచట సమ్మర్ద మింకఁ
గలుగు నెటకైన మన మరుగంగవలయు
ననుచు నచ్చోటు వెలువడి యతిరయమున. ౨౬౫

క. రమణీయ విశాలానగ
రమునం జెలువారు పుష్కరక్షేత్రమునన్
శమదమయుతవినుతంబగు
సమధికనిష్ఠఁగొని తపము సలుపుచు నుండెన్. ౨౬౬

వ. అనంతరంబ. ౨౬౭

సీ. ధర్మశీలుం డయోధ్యానాథుఁడగు నంబ
రీషుండు మఖ మొనరించుచుండ
నాక్రతుపశువు జంభారాతి ముచ్చిలె
నప్పుడా నృపుఁగని యాజకుండు
పలికె నిట్లవనీశ పటుమదంబున నీవు
పశువు నేమఱియుంటి పశువు లేక
యున్న ప్రాయశ్చిత్త మొగిఁ జేయఁదగు నొండె
పశువున కొక నరుఁ బశువుఁజేసి

గీ. యాగ మొనరింపవలయు నీ యధ్వరమున
కంతరాయంబు గల్గిన యాగకర్త
కెడయుఁగావున నధ్వరం బెడయకుండఁ
బశువు వేవేగఁ దెప్పింపు పార్థివేంద్ర. ౨౬౮

వ. అనిన నమ్మహీశ్వరుండు పుత్త్రకళత్రపరిజనసమేతుండై సత్వరంబుగ
నగరంబు వెలువడి పురగిరిసరిజ్ఝరీగుహాగహనవాపీకూపతటాకవల్మీ
గోష్ఠాదిప్రదేశంబుల నన్వేషించి, యెందునుంగానక చింతాకులమా
సుండై చనుదెంచి, యొక్కయెడ రుచికుండను మహాత్మునిం జూచి
యతని కిట్లనియె. ౨౬౯

గీ. క్రతుపశువు నెల్లచోటులఁ గలయ వెదకి
కానలేనైతిఁ గాన నీ సూను నొకని
పశువుగా నిమ్ము దీనికిఁ బ్రతిగ నీకు
లక్ష గోవుల నిచ్చెద నీ క్షణమున, ౨౭౦

వ. అనవుడు. ౭౭౧

క. జనకుం డగ్రతనూజుని
జనని కనిష్ఠాత్మభవుని చన నియ్య మటం
చును జెప్పిరి ముందుగ స
త్తనయులు తమ కిష్టులగుట తగ వాకిషఁచున్. ౭౭౨

క. జననీజనకులపల్కులు
విని మధ్యమపుత్త్రు నన్ను విడిచిరి వీరల్
జనవలసె పశువునై నే
ననుచు శునశ్శేఫుఁ డిట్టు లనె నానృపుతోన్. ౭౭౩

క. పెద్దకుమారుఁడు తండ్రికిఁ
దద్దప్రియుఁడు పిన్నకొడుకు తల్లికిఁ బ్రియుఁ డీ
యిద్దఱు వదలినవాఁడన్
మద్దెముఁడను వత్తునేను మానవనాథా ! ౭౭౪

వ. అని మఱియు నిట్లనియె. ౭౭౫

గీ. నీవొసంగెద నన్నట్టి గోవుల నిఁక
వీరలకు నిమ్మటన్న నద్ధారుణీశ
వర్యుఁ డా లక్షగోవులు వారికిచ్చి
యతని రథమున నిడికొని హర్ష మెసఁగ. ౭౭౬

వ. సత్వరంబుగాఁ జనుదెంచి, పుష్కరక్షేత్రంబున విడిసియున్న సమయం
బున నచ్చటఁ దపోనిష్ఠాగరిష్ఠుండై యున్న గాధేయుసమీపంబునకుం
జని, శునశ్శేఫుం డతివినయంబున దండప్రణామంబు లాచరించి, దీన
వదనుండై యతని కిట్లనియె. ౭౭౭

క. మా తండ్రి పెద్దకొమరుని
మా తల్లియుఁ బిన్నసుతుని మక్కువఁగని యీ
రీతి నను నంబరీషున
కాతత మఖపశువుగాఁగ నమ్మిరి మామా! ౭౭౮

క. కలుషాత్ములు వారెక్కడి
తలిదండ్రులు నాకు నీవ తలిదండ్రివి కే
వలవిధివి నృపతిమఖమున
ఫలమొసఁగిచి నన్నుఁ గరుణ బ్రతికింపఁగదే. ౭౭౯

క. అని దీనవృత్తి సభయుం
బనివారణ వేఁడుచున్న నల్లుని భీతా
త్ముని నాదరించి కౌశిక
ముని తన సూనులను జూచి ముదమునఁ బలికెన్. ౭౮౦

సీ. తనుభవులార! యిమ్మునికుమారుఁడు నాకు
నల్లుండు శరణార్థి యయ్యెఁ గాన
మీలోన నొకఁడు నెమ్మిని యాగసిద్ధికై
పశువయి బ్రతికింపవలయు నితని
భువిలోనఁ బురుషుండు పుత్త్రులఁ గాంచుట
పరలోకసౌఖ్యంబుఁ బడయఁగాదె
యితని మీరలు కృప నీక్షించి బ్రోచుట
పరలోక మిదె నాకుఁ బరమపదము

గీ. మఱియు నిది బంధుకృత్యం బమర్త్యవహ్ని
తర్పణంబును సభయప్రదాన మధ్వ
రావనంబును మద్వచనాదరంబు
గాన ధర్మంబు మీకింతకంటెఁ గలదె. ౭౮౧

వ. అనిన వారు సమ్మతింపక తండ్రి కిట్లనిరి. ౭౮౨

క. త్రాతల మంచును నిజ తను
జాతులఁ దనుమాడి యన్యజన్ముల బ్రోవం
జూతురె యెవ్వారైనన్
దాతుడ (?)వీవెన నగుము తగ విప్రులుకుల్. ౭౮3

వ. అనిపలుకుచున్న నిజనందనులం జూచి కోపించి మద్వచనాతిక్రమ ణంబుచేసితిరి గావున, మీరింక సహస్రవత్సరంబులు శునకమాంసంబు భక్షించుచు, బహుదుఃఖంబులంబడి చరింపుఁడని శపించి, విశ్వామిత్రుండు కరుణాసమేతుండై శునశ్శేఫునిం గాంచి యిట్లనియె. ౭౫౮

గీ. రెండు మంత్రంబులిచ్చెద నిందు వేడ్క
వాని జపియింపఁగా భద్రమౌను నీకు
యాగఫల మబ్బు నరపతి కనుచువాని
నిచ్చి పంచిన నతఁ డేఁగె మెచ్చు గులుక. ౭౫౯

చ. బలయుతుఁడైన రాజట విభావరిఁబుచ్చి, ప్రభాతివేళఁ దా
నెలమి మఘక్రదేశమునకేఁగి మునీంద్రజు యూపమందు సొం
పలరఁగఁ గట్టి గంధకుసుమాదులచేఁ బసుపూజచేసి ని
శ్చలమతి యాజకోక్తుల వెసన్ విశసింపఁ దలంప నంతలోన్. ౭౬౦

మ. తాపసనాథసూనుఁడు యథావిధి సమ్మహనీయమంత్రములి
వేఁబఠియింప నింద్రుఁడు నుపేంద్రుఁడు నాడకు వచ్చివేడ్కచే
భూపతిఁ గాంచి, తత్సవనపూర్ణ ఫలంబు నొసంగి యాశున
శ్శేఫునిప్రాణరక్షణముచేసి దివంబునకేఁగి రంతటన్. ౭౬౧

చ. అనఘుఁడు కౌశికుం డధికమైన తపంబు సహస్రవర్షముల్
ఘనతర నిష్ఠఁజేయ నల కంజభవుండును నిర్జరుల్ రయం
బునఁ జనుదెంచి నీతపము పూజ్యమగున్ ఋషివైతి వంచువేఁ
జన ముదమంద కెప్పటికిఁ జండతపం బతఁ డాచరింపఁగన్. ౭౬౨

ఉ. మీనవిలోచనంబులు సమిద్ధతటిల్లతికాభమైన నె
మ్మేను ప్రసూనగుచ్ఛముల మించు కుచంబులు నీల వేణి చం
ద్రానన ముల్లసత్కటి సమంచితహాసముఁ గల్గి వెల్గు న
మ్మేనక వచ్చి చెంగట గమింపఁగఁ గన్గొని మోహితాత్ముఁడై. ౭౬౩

ఉ. చేడియ నామనంబుఁజొరఁ జిత్తభవుండు శరంబు లేయుచు
న్నాఁడు రతిప్రసంగముల నాకు ముదం బొనరింపు మంచుఁ బూఁ

బోఁడినిగూడి కోరికలు పూర్ణములై వెలయన్ దశాబ్దముల్
క్రీడ యొనర్చి, యాత్మఁ బరికించి ఘనంబగు తెల్విఁ గాంచుచున్. ౨౯౦

క. ఈనెపమున నాతపమునిఁ
మానుపఁ దలపోసి సురలు మానితయగు ని
మ్మానినిఁ బంపి రటంచును
మానిని నమ్మగువఁ బంచె మగుడన్ దివికిన్. ౨౯౧

క. పంచి విజితేంద్రియుఁడనై
పంచాస్త్రుఁ జయింతు ననుచు భావించి హిమా
భ్యంచితశైలము వెనుకన్
వంచనలేకుండఁ దపము వర్ధిలఁజేసెన్. ౨౯౨

వ. అట్లు కౌశికీతీరంబునందు. ౨౯౩

ఉ. ఘోరతపంబుఁ జేయఁ గనుఁగొంచు సురల్ భయసంవృతాత్ములై
నీరజగర్భుఁ గాంచి యిఁక నీవు మహర్షివనంగఁ గౌశికుం
డారయ నవ్వఁడన్న నటులయ్యెడు నంచు నతండు గాధిజుం
జేరి మహర్షివైతి వనఁ జెచ్చెర ధాతకు నాతఁ డిట్లనెన్. ౨౯౪

క. నను బ్రహ్మర్షి వటంచున్
బనివడి తథ్యముగ నీవు పలికి దాఁకన్
ఘనదీక్షఁ దపముఁ జేసెద
దినకరతేజోగరిష్ఠ! దేవజ్యేష్ఠా! ౨౯౫

క. అన విని యట్లాగాక యటం
చును బంకజసంభవుండు సురలాత్మనివే
శనములకు నరుగ వెడలియు
ఘనమాత్సర్యంబుతోడఁ గౌశికుఁ డచటన్. ౨౯౬

సీ. అతినిష్ఠ చే నిరాహారుండు నూర్ధ్వబా
హుండునై శీతున నుదకములను

వేసవులను బంచవీతిహోత్రులమధ్య
మునను బ్రావృట్కాలమునను బయట
నుండి వెయ్యేడు లత్యుగ్రమాతప మొన
రింపఁగా నంత నిలింపవిభుఁడు
రంభను గాంచి యోరామ నిర్జరహిత
కార్యంబుఁ జేయంగఁ గడఁక నరిగి

గీ. కౌశికుఁ డొనర్చు తప మంత గాసిచేసి
రమ్ము నన్నఁగ నన్ను శపించు నమ్మునీంద్రుఁ
డధికరోషాత్ముఁ డచటి కే నరుగ నెఱతు
ననినఁ బ్రమ్మలి దానికిట్లని యెనతఁడు. ౨౯౭

క. నీ కింత వెఱవ నేటికిఁ
బ్రాకటముగఁ దోడునీకుఁ బంచెద నానా
లోకజయకాముఁ గామున్
గోకిలముల వెనుక నేచు గోరిక వత్తున్. ౨౯౮

వ. అనిపలికిన. ౨౯౯

సీ. రాకాశశాంకు నిరాకరించు మొగంబు
కలువతేకుల నేలు కన్నుదోయి
బింబికాఫలసన్నిభంబైన యధరంబు
ఘనమండలముఁబోలు కచభరంబు
కరికుంభముల మించు గబ్బిచన్నంతులు
గగనభాగము నెన్నఁదగిన నడుము
పల్లవశ్రీ ల్వెదచల్లు హస్తంబులు
సరసిజంబులఁ గేరు చరణయుగము

గీ. పరభృతంబుల వంచించు భాషణములు
నంచబోదల నిరసించు యానములును

కనకలతికోపమంబైన కాయ మలర
రంభ చనుదెంచెఁ గౌశికారామమునకు. ౨౦౦

వ. ఇట్లు చనుదెంచి. ౨౦౧

క. మకరాంకుఁడు సుమనస్సా
యకములు వడినేయ పికచయంబులు గూయన్
సకలజనమోహసంధా
యకమగు గానం బొనర్చు చండఁజెలింపన్. ౨౦౨

క. కనుఁగొని కౌశికుఁడు మనం
బునఁ గడుఁ దలపోసి మత్తపోభంగము దా
నొనరింపఁ నింద్రుఁడనిచిన
ఘనగర్వముఁ బూనివచ్చెఁగద యిది యనుచున్. ౨౦౩

క. రోషానలదీప్తుండై
యోషామణిఁ జూచి దుర్గుణోపేతమహా
దోషా! పదివేలేడులు
పాషాణమ వగు మటంచు పరఁగశపించెన్. ౨౦౪

గీ. అట్లు శపియించి శాపకాలాంత మగుటఁ
బడఁతి యొక విప్రువలన శాపంబు దొలఁగు
ననుచు వచియింపఁగా శిల యయ్యె రంభ
యట నిలవలేక సరగున నరిగె మరుఁడు. ౨౦౫

వ. అంత. ౨౦౬

సీ. తనతపం బటు కొంత దఱిఁగిన వగవక
యజుఁడు బ్రహ్మర్షి వీవై తివనుచు
ననుఁ బల్కునందాఁక ఘననిష్ఠఁగైకొని
హాని మీఱ సహస్రహాయనములు

నిర్జితేంద్రియుఁడనై నిశ్చలచిత్తుండ
నై నిరాహారుండ నగుచు నుండి
యూర్పులు పుచ్చక యురుతపం బొనరింతు
ననుచు నుత్తరదిశ నపుడు విడిచి

గీ. తూర్పుదెసకు నేఁగి నేర్పుమీఱంగ సి
ద్ధాశ్రమ స్థలంబునందుఁజేరి
వరుసతో సహస్రవత్సరంబులు నిండ
నుగ్రతప మొనర్చి యొక్కనాఁడు. ౧౦౭

క. పారణఁ జేయఁదలంచిన
వారిదవాహనుఁడు విప్రవరుఁడై దన కా
హారము వేఁడిన ముద మే
పారఁగ నిడ నన్న మంత యతఁడు భుజించెన్. ౧౦౮

వ. అనంతరంబ. ౧౦౯

ఉ. పాయని నిష్ఠఁ గౌశికుఁ డపారతపంబు సహస్రవర్షముల్
చేయుచునుండ మూర్ధమునఁ జిత్రకరాతిభయంకరాగ్నికీ
లాయుతసాంద్రధూమనికరంబులు వెల్వడి విక్రమాహవై
హాయసగహ్వరీ ఘనతరాంతర మంతయు నాక్రమింపఁగన్. ౧౧౦

క. నక్షత్రంబులు రాలెను
సక్షోభములయ్యె సప్తజలధులు జగముల్
విక్షేపించెను మిడుఁగురు
లక్షీణమ్ములగుచుఁ బర్వ నశనులు వడిమెన్. ౧౧౧

క. నగములు తావులు దప్పెను
ఖగములు మృగములును బన్నగంబులు సోలెన్
వెగడొందె దివిజవర్గము
గగనము మొఱవెట్టె ధరణి కంపముఁ జెందెన్. ౧౧౨

గీ. అపుడు సురముని గంధర్వ లబ్జభవుని
కడకు వెసనేఁగి తత్త్వాదక్రమములకు

భక్తిచే మ్రొక్కి మావిన్నపంబు లింకఁ
గరుణఁ గైకొనుమని చెప్పఁగడఁగి రిట్లు. ౮౧౩

శా. విశ్వామిత్రుఁడు బ్రహ్మమా తపముఁ గావింపంగఁబూనెన్; మరా
ళాశ్వా! యిమ్మెఁక నమ్మహాமునికి బ్రహ్మర్షిత్వ మైనన్ మహా
శశ్వద్వైభవశాలి బ్రహ్మపురరాజ్యంబైన నీవేని నీ
విశ్వంబుల్ దెగుఁ దత్తపోనిలసఖావిఖ్యాతకీలాలిచేన్. ౮౧౪

గీ. అనినఁ బద్మజుండు మునిసురయుక్తుఁడై
వచ్చి గాధితనయు నిచ్చఁ జూచి
పటుతపోబలమున బ్రహ్మర్షి వీవైతి
విట్టి ఘోరతప మిఁకేల యనుడు. ౮౧౫

వ. కౌశికుండు వాగీశున కిట్లనియె. ౮౧౬

గీ. బ్రహ్మ సంభవుండు బ్రహ్మర్షి వరుఁడగు
నవ్వసిష్ఠుఁ డిచటి కరుగుదెంచి
పరఁగ నన్నుఁ గాంచి బ్రహర్షి వైతి వీ
వనక నమ్మనేర నయ్య జియ్య! ౮౧౭

వ. అనిన విని బ్రహ్మాదిదేవత లవ్వసిష్ఠమునీంద్రునిం బిలిపించిన, ౮౧౮

ఉత్సాహ. తర్షివైమె వసిష్ఠుఁ డటకుఁ దరలివచ్చి గాధిజున్
హర్ష మొప్పఁ గని తపోమహత్త్వమునకు నీవు బ్ర
హ్మర్షివైతి వింక సందియంబు మాను మన జితా
మర్షుఁడగుచుఁ గౌశికుం డమందనందితాత్ముఁడై. ౮౧౯

క. ఘనుఁడైన వసిష్ఠుని పద
వనజయుగంబునకు భక్తి వందన మిడి పూ
జన మొనరించి నుతించెన్
జని రంతట నెలమి సరసిజప్రముఖసురుల్. ౮౨౦

వ. అని చెప్పి ... ౮౨౧

గీ. తపముబల్మిని గాధిసంతతి సలిపిన
కార్యములు చెప్పఁగా ననేకములు గలవు
రూఢిగా నెన్న హరియొ హరుండొ కాక
యతఁడు కేవలమానియే యిసకులేంద్ర! ౧౨౨

క. అని చెప్పిన దాశరథులు
జనకుం డచ్చోటనున్న జనులుఁ మునులున్
విని మనముల నరుదందుచు
వినుతించిరి ఘనచరిత్రు విశ్వామిత్రుఁ. ౧౨౩

వ. అంత రామచంద్రుండు శతానందున కిట్లనియె. ౧౨౪

క. అందమ్మగుపేర శతా
నందుడ వతివిశదవాగ్గణంబులను శతా
నందుఁడవు పరబ్రహ్మా
నందుఁడ వీ వక్షపాదనందన! తలఁపన్. ౧౨౫

వ. అని యనేకవిధంబుల వినుతించుచున్నయవసరంబున సరోజబాంధవుం డస్తగిరిమస్తకాంతరితుం డగుటయు నాగాత్రి చనిన మఱునాఁడు కౌశికమునీంద్రుండు కాలోచితంబులు దీర్చి రామలక్ష్మణసమేతుండై జనకమందిరంబున కరిగి జనకకృతసత్కారసంతుష్టమానసుండై జనకున కిట్లనియె. ౧౨౬

గీ. జనకభూపాల! నీయింటఁ దనరుచున్న
రాజశేఖరచాప మీ రాజసుతులు
గన్గొనెడు వేడ్క వచ్చిరి గాన నిటకు
సరగఁ దెప్పింపు మావిల్లు జనులచేత. ౧౨౭

వ. అనిన జనకుండిట్లనియె. ౧౨౮

క. శివునకు దక్షాధ్వరమున
సవభాగము లొసఁగకున్న శంకరుఁడు మహా
హవమున నీధను వందుచు
దివిజావళి ... ప్రోలె ... ప్రముఖులన్.

క. అంతట గీర్వాణు లుమా
కాంతుని శరణంబువేఁడఁ గరుణాయుతుఁడై
శాంతిఁగని సురలకెల్లను
గంతుహరుం డభయమొసఁగె ఘనమోదమునన్. ౨౩౦

వ. తదనంతరంబ. ౨౩౧

సీ. అనఘ మత్కులపూర్వుఁడగు దేవరాతున
కిచ్చె నీకోదండ మిందుధరుఁడు
నాఁ డాదిగా మునినాథ యీచాపంబు
మాయింటనుండు సన్మాన్యలీలఁ
గ్రతుభూతలంబు నాఁగట నేను దున్నుచు
నుండంగ నందొక్క యువిద పుట్టె
సీతాంతరంబునఁ జెలువ జన్మించుట
సీతాభిధానంబు చేసి తనయ
గీ. గాఁగఁ బెంచితిఁ బరిణయకాల మగుడు
శంకరశరాస మెక్కిడఁజాలువాని
కిత్తు నాకూఁతునని యెల్లయెడలఁ జాటఁ
బంచినాఁడ స్వయంవరం బంచితముగ. ౨౩౨

శా. ఆవార్తల్విని రాజనందనులు నెయ్యంబొప్ప నీప్రోలికిన్
వేవేగన్ జనుదెంచి బాహుబలమున్ వీర్యంబు శోభిల్లఁగా
నా విల్లంది కదల్పలేక మదిలో నాశ్చర్యమేపారఁగాఁ
బోవం జొచ్చిరి వారిదేశములకున్ బుణ్యాత్మ ! లజ్జించుచున్. ౨౩౩

ఉ. కొందఱు మేదినీపతు లకుంఠితవిక్రమ మొప్ప వారణ
స్యందనవాజిసద్భటచయంబులతోఁ జనుదెంచి నేను మె
చ్చం దగఁ జాప మెక్కిడఁగఁజాలక యాలముసేయఁబూని నా
ముందఱ నిల్వలేక బలముల్ చెడిపోయిరి వచ్చుత్రోవలన్. ౨౩౪

ముత్కరుఁ డీరాముఁడు శశి
భృత్కోదండంబు నెక్కు వెట్టిన నిపుడే
మత్కన్య నితని కిచ్చెద
సత్కర్మములు నన్ను సత్యశాలి యనంగన్. ౧౩౫

వ. అనిచెప్పి జనకనృపాలుండా శరాసనంబుఁ దగువారిం బనిచి తెప్పించి
సభాతలంబునందుఁ బెట్టించి, విశ్వామిత్రున కిట్లనియె. ౧౩౬

గీ. గరుడగంధర్వయక్షరాక్షసులకైన
నమరులకునైన దుర్భరంబైన యీ శ
రాసనం బెత్తె మనుజుల కలవియగునె
యైన రాఘవులకుఁ జూపు మనఘ ! దీని. ౧౩౭

వ. అనిన విని కౌశికమునీంద్రుండు రామభద్రున కిట్లనియె. ౧౩౮

గీ. దశరథాత్మజ యిటు చూడు దండహస్త
చండవిస్మయఖండనోద్దండఖండ
పరశుకోదండ మిది దీని బలిమి నెత్తి
యెక్కువెట్టుము ఘనకీర్తి దక్కు నీకు. ౧౩౯

చ. అని ముని పల్క, రాముఁడు శరాసనఘుంగని చేరి దానిపైఁ
దనరుచునున్న కప్పు ప్రమదం బొదవన్ వెడలించి ధాత్రి న
ద్ధనువిడి నారిఁగూర్చి సుకృతంబగుముష్టిని బట్టి యెత్తి లీ
లను బెగఁదీయఁగా విరిగె లస్తకసీమకు విల్లు గొబ్బునన్. ౧౪౦

సీ. పుండరీకాక్షుండు చండధామాన్వయ
మండనుండగు రాఘవుండు సభను
ఖండేందుధరునికోదండంబు నడిమికి
ఖండించి తనదైన గండుఁ జూపు
చండఁ గార్ముక మహోద్దండనిర్ఘోషంబు
మెండుగా బ్రహ్మాండభాండమెల్ల
నిండంగ నిద్ధరామండలంబు వడంకెఁ
గొండలు గదలె నక్కుండలపతి

గీ. బెండుపడె దేవదైత్యుల గుండె లవిసెఁ
గాండనిధులు గలంగె మార్తాండసోమ
మండలము లధ్వముల్ దప్పియుండె ఋక్ష
కాండములు రాలె వడగళ్లపిండులట్లు. ౨౪౧

గీ. అమ్మహారావ మాలించి యధికసత్వ
రాజితుండైన జనకధరావిభుండు
కౌశికుండును రామలక్ష్మణులుదక్క
నెల్లవారలు సభను మూర్ఛిల్లి రపుడు. ౨౪౨

వ. అంత ముహూర్తమాత్రంబునకుఁదెలివినొందిన డెందంబులందలరారు సభాసదులు తమలోన. ౨౪౩

సీ. శివుని కార్ముక మెత్తి యవలీల విరువంగ
శివునంతవానికిఁ జెల్లుఁగాక
యన్యుల వశమౌనె యనువారు రాజశే
ఖరు విల్లు రాజశేఖరుఁడు విరిచె
చిత్ర మేమనువారు చేరిమహాబలుం
డతిసమర్థత చే శరాసనంబు
విదళించునట్టు లివ్వేళ మహాబలుం
డగు సీతఁజెలమి శరాసనంబు

గీ. శకలములుచేసె మునుపున్న సరణిగాదె
యనెడువారు మహాసాధ్య మనెడువారు
హరిపరాక్రముఁ డీరాముఁ డనెడువారు
పూరుషోత్తముఁ డితఁ డనువార లైరి. ౨౪౪

వ. ఇట్లనేకు లనేకవిధంబుల రామభద్రుం బ్రశంసించుచున్న విని జనక మహీశుండు కౌశికమునీంద్రున కిట్లనియె. ౨౪౫

ఉ. ఓమునినాథ ! నీకృప మహోన్నతభాగ్యము నేఁడు గల్గె నీ
రాఘుని విక్రమంబు మది రంజిలఁ గంటిని నామనోరథం
బీమనుజేంద్రు నల్లునిగ నిప్పుడు గైకొన నొప్పు దేవతా
స్తోమము మెచ్చ నాపలుకు సూనృతమై యలరారు నిమ్మహిన్. ౨౪౬

చ. అన విని కౌశికుండు ముదమందిన డెందముతోడ నాతనిం
గనుఁగొని యిట్లు పల్కు; జనకక్షితిపాలక! నీదు వాక్యముల్
వినఁదగుఁ బెండ్లియత్న మిఁక వేగము సేయుము నీతనూజకుం
బెనిమిటి రాఘవుండగుటఁ బెంపువహించు భవద్యశం బిలన్. ౧౪౭

క. నారాయణుండు దుగ్ధాం
భోరాశికి నల్లుఁడైన పోలుపున ధరలో
నీరాముఁడు నీయల్లుం
డై రాజిల నీదుభాగ్య మభినుతికెక్కున్. ౧౪౮

క. అని ముని పల్కిన వినుచును
జనకుం డెద ముదము గదియ సచివులఁ గనుచున్
ఘనులార మీ రయోధ్యకుఁ
జని దశరథుఁగాంచి వినయచాతురి మెఱయన్. ౧౪౯

గీ. తగిన మాట లాడి తనయుల పెండ్లికిఁ
దర్లి రం డటంచు దశరథేశుఁ
బిలువ నేఁగుఁ డనినఁ జెలఁగుచు సరగ న
యోధ్యకరిగి మంత్రు లుచితగతిని. ౧౫౦

వ. దశరథేశ్వరుఁ బొడగని యిట్లనిరి. ౧౫౧

చ. జనకనృపాలుఁ డంపిన వెసం జనుదెంచితిమయ్య వేడ్కన
మ్మనుజవరేణ్యు మంత్రులము మావచనంబు లతండు పల్కుచొ
ప్పున మది నెంచఁగా వలయు భూరిశుభం బొనగూడు మీకుగొ
బ్బున నెఱిఁగింతు మవ్విధముఁ బొందుగ భాస్కరవంశవర్ధనా! ౧౫౨

సీ. దశరథేశ్వర నీదు తనయులు రామల
క్ష్మణులు విశ్వామిత్ర మౌనివెనుకఁ
జనుదెంచి పెక్కండ్ర దనుజులఁ బరిమార్చి

గౌతమముని జన్మగ్రామణీ భామినీ
శాపంబు దొలఁగించి జనకనృపతి
యొనరించు యాగంబు గనుఁగొన మిథిలకు
నేతెంచి రచ్చట భూతనాథు

గీ. విల్లు రాముండు నిజ భుజవీర్యమునను
విరువ జనకమహీశుఁ డవ్వేళ మిగుల
సంతసించుచు సుతను భూజాత పూత
సీత రామునిజాయఁగాఁ జేయఁ దలఁచె. ౧౫౩

క. అటు దలఁచి నెమ్మది మహో
త్కట సంతోషమునఁ బొంగి కౌశికమునితోఁ
బటుమతిఁ దెల్పఁగ శుభ మిటు
ఘటియిల్లు నటంచుఁ బల్కెఁ గరుణ న్మునియున్. ౧౫౪

వ. అట్లగుటం జేసి, ౧౫౫

క. వేవేగ మిమ్ముఁ దోడ్కొని
రావలయు నటంచు మమ్ము రహి నజ్జనక
క్ష్మావరుఁడు పనిచెఁ గావున
భూవర విచ్చేయవలయుఁ బొలుపుగ నటకున్. ౧౫౬

మ. అని దెల్పంగ నజాత్మసంభవుఁ డమందానందచేతస్కుఁడై
జనకక్ష్మావిభుమంత్రిముఖ్యులకు విస్తారాంబరంబుల్ మణుల్
కనకంబుల్ దగనిచ్చి రాఘవుల సత్కల్యాణవార్తన్ బురం
బునఁ జాటించిన వించుఁ బౌరనికరంబుల్ సంతసిల్లెన్ గడున్. ౧౫౭

వ. అంత దశరథమహీకాంతుండు పురాలంకరణంబు సేయించి దివ్యాం
బరాభరణంబులు ధరించిన వసిష్ఠవామదేవకశ్యపమార్కండేయ
కాత్యాయనాత్రి జాబాలి ప్రముఖమహామునులును, సుమంత్రాది
మంత్రులుం బరివేష్టింప, భూసురాశీర్వాదనాదంబులు సెలంగ,
నపరిమితోత్సాహంబునఁ బుణ్యాంగనాసముదయంబులు పౌరజనం
బులతోడ నేతేర, మిథిలాపురప్రయాణోన్ముఖుఁ డగుటయు, ౧౫

గీ. కనకమణిభూషణార్చులు కాయములను
నిండ, ముత్తెంపు గొడుగులనీడ లమర,
భరత శత్రుఘ్ను లురుతరభద్రగజము
లెక్కి-వచ్చిరి తండ్రికి నింపుమిగుల. ౮౫౯

సీ. ఘనతర నిస్సాణ కాహళభేరికా
వరమృదంగధ్వనుల్ వఱలుచుండ
వైణికగాయకవాంశికాదులు కను
సైఁగలచతురతల్ సారెఁ దెలుప
వారకాంతామణీవర్గంబు నర్తన
గానచాతుర్యముల్ పూని నడువ
వంది మాగధ సూత బృందంబు లిరువంక
లందుండి సన్నుతు లాచరింప

గీ. గజతురంగశతాంగసంఘములఁ గూడి
భటులు నిశితాయుధంబులు పట్టి కొలువ
ఛత్రచామరముఖ్య లాంఛనము లలరఁ
బురము వెలువడె నారాజపుంగవుండు. ౮౬౦

వ. ఇట్లయోధ్యాపురంబు నిర్గమించి, సపరివారుండగు నాదశరథేశ్వరుండు మార్గంబులఁ బురంబులు విపినంబులు మహానదులాదిగాఁ గలుగు నవియెల్ల నతిక్రమించి, కతిపయప్రయాణంబుల విదేహనగరంబుఁ బ్రవేశించిన నవ్వార్త యెఱింగి యప్పుడు. ౮౬౧

క. ఎదురేఁగి జనకనరపతి
మది మోదము గదుర నజకుమారు నుతించెన్
మృదుతరభాషణములచేఁ
ద్రిదశేంద్రునిఁ బొగడు వరుణదేవునిమాడ్కిన్. ౮౬౨

గీ. సన్నుతించి యథావిధి సత్కరించి
ఘనవసిష్ఠాదిమునిజనగ్రామణులకు

వినతు లొనరించి వారి దీవనలు గాంచి
తగిన నెళవున విడియింపఁ దలఁచి యంత. ౨౬౩

క. విడిదలఁ జూపఁగఁ గనుఁగొని
వడివడి లెండనుచు భద్రవాద్యస్వనముల్
కడుఁ జెలఁగ దశరథుఁడుఁ బరు
వడి నచ్చటఁ జేరె సపరివారుం డగుచున్. ౨౬౪

వ. ఆసమయంబున. ౨౬౫

చ. కుశకులసంభవుండు ననఘుండగు గాధిసుతుండు వేడ్కనా
దశరథుఁ జూడఁగోరి వితతప్రభులన్ జనమాన్యులన్ మహా
యశులను రామలక్ష్మణుల నర్మిలిఁగైకొని రాఁగ నాతఁడున్
భృశవినయంబునన్ మునివరేణ్యునిపాదము లంటి మ్రొక్కుచున్.

క. మునివర నీకారుణ్యము
నను శుభములఁ గంటి ధరణినాథ స్తవముల్
గొనఁదగు కీర్తులఁగంటిని
నిను వినుతింపంగ నేర్తునే ధీరమణీ. ౨౬౭

చ. అని పలుకంగ మౌని ముదమందుచు దీవనలిచ్చి వంశపా
వన విను; నీకు ధాత్రి సరివత్తురె పార్థివులంచుఁ బల్కి స
య్యనఁగని రామలక్ష్మణుల నయ్యకు మ్రొక్కుఁ డటంచుఁ దెల్పఁగా
వినయముతోడ వారు పృథివీపతికిన్ దగ మ్రొక్కి నిల్చినన్. ౨౬౮

క. నందనులఁ గౌఁగిలించి య
మందానందంబుతోడ మనుజేంద్రుఁడు సం
క్రందనతుల్యుఁడు వారల
నందుగ దీవించె నంత నాతనితోడన్. ౨౬౯

గీ. కౌశికుఁడు పల్కునాదుయాగంబుఁ బ్రోచి

జనకుఁడొనరించు సవనంబు సరవిఁజూడ
నరుగుదెంచిరి నీసుతు లవనినాథ. ౮౭౦

ఉ. రాముని విక్రమంబు సచరాచరమైన జగంబులో మహో
ద్దామ మటంచు నెన్నఁదగె ధర్మగుణాన్వితు సాధురక్షకున్
శ్రీమహితాంగు సన్నుతవిశేషచరిత్రుని నిర్మలాత్మునీ
రామునిఁ బుత్త్రుగాఁబడసి రంజిలుచుంటివి వైభవంబునన్. ౮౭౧

క. సత్యవచనంబు దప్పక
సత్యము బుధవినుతిఁగాంచి నెగడెదు ధరణీ
పత్యవతంసమ భవదా
న్నత్యముఁ బొగడంగవశమె నలువకునైనన్. ౮౭౨

క. అనిపలుక నంత జనకుం
డినకులవల్లభునిఁ జూచి యిట్లను నృప నీ
ఘనతరసంబంధము నా
మన మలర ఘటిల్లె నేఁడు మద్భాగ్యమునన్. ౮౭3

గీ. అనుచు జనకనృపాలుఁడు వినయరీతిఁ
బలుకు నమ్మాట కలరుచుఁ బంక్తిరథుఁడు
వినుము నరపాల నీవు నావియ్యమగుట
నామహోన్నతి జగతి నెన్నంగవశమె. ౮౭౪

చ. అనివచియింప వించు జనకావనిపాలకుఁ డా నృపాలు వీ
డ్కొని తనమందిరంబునకు గొబ్బున నేఁగి యమాత్యవర్గమున్
గనుఁగొని పెండ్లియత్నమిఁక గ్రక్కున సేయవలెంగదా యటం
చును దగనాడ నీమతము చొప్పున యత్నములయ్యె నన్నియున్ ౮౭౫

వ. అనిచెప్పిన సంతోషించి, యమ్మఱునాఁడు జనకభూపాలుండు సకల
జనంబులు పరివేష్టింప సభాస్థితుండై మంత్రులంగనుంగొని దశర
థేశ్వరుం దోడ్కొని రండని పంచిన వార లరిగి ప్రభాకరవంశరత్నా
కరచంద్రుఁడగు [illegible] బెడింగిం

చిన సతండు వసిష్ఠాదిమహామునులును పుత్త్రమిత్త్రామాత్యాది జనంబులును గొలువ నేతెంచి జనకునియాస్థానంబునఁ బ్రవేశించిన వారల కందఱకు నుచితసత్కారంబులు గావించి సముచితాసనంబులఁ గూర్చుండనియమించి, యానందభరితమానసుండై జనకుండు దశరథున కిట్లనియె. ౮౭౬

గీ. నరగఁ బెండ్లికి లగ్ననిశ్చయముఁ జేయ
వలయు మీరింకఁ బెద్దలవలనఁ దెలిసి
యనిన ముదమంది యర్కవంశాభిరాముఁ
డగు నృపాలుండు జనకున కనియె నిట్లు. ౮౭౭

క. నరపాలక విను మస్మద
భిరతుల్ సుమతుల్ వసిష్ఠవిశ్వామిత్రుల్
గురుతరతపోధనుల్ ముని
వరు లేతత్కార్యభారవాహకులుగదా ! ౮౭౮

వ. కావున వీరలు సకలప్రయోజనంబులు నిర్వహింపంగలవారని పల్కి, దశస్యందనుండు వసిష్ఠవిశ్వామిత్రుల కిట్లనియె. ౮౭౯

సీ. మునివర్యులార ! రాముని వివాహము తోడఁ
దక్కిన మువ్వురు తనయులకును
బరిణయంబులు సేయ భావించితిని గాన
మీమనంబుల నిట్టిమేలు దలఁచి.
జనకనందన నూర్మిళను లక్ష్మణునకును
వరగుణుండగు కుశధ్వజుని సుతల
భరతశత్రుఘ్నుల కిరవొంద నిమ్మని
జనకభూపాలుని సరవి నడుగుఁ

గీ. డనిన వా రట్ల యగునని యడుగ జనకుఁ
డాత్మ నెంతయు సంతోషమంది యట్ల

నాతనూజల నొసఁగెద నాఁగ, వినుచుఁ
బఙ్క్తిరథుఁడాత్మ సంతసంపడియె నంత. ౮౮౦

క. అమ్మునివరు లాత్మల యం
దిమ్ములఁ బరికించి విబుధులెన్నఁగ శుభల
గ్నమ్మొకటి నిశ్చయించిరి
యమ్మనుజాధిపులు మిగుల హర్షింపంగన్. ౮౮౧

వ. అంత దశరథేశ్వరుండు జనకమహీపాలు వీడ్కొని, సపరివారుండై విడిదల కరిగి స్నానసంధ్యాద్యనుష్ఠానభోజనాదికరణీయంబులు సల్పుచు సుఖంబుండె; జనకుండును గొల్వుచాలించి, యభ్యంతర మందిరంబున కరిగి, యథోచితప్రవర్తనుండయ్యె ననంతరంబ. ౮౮౨

గీ. కౌసలేయు వివాహంబుఁ గనఁగ మీకు
ననిమిషత్వంబు సార్థకంబగును రండ
టంచు దివిజులఁ బిలువంగ నరుగుకరణిఁ
దరణి యస్తాద్రిమరువున కరిగె నంత. ౮౮౩

క. శ్రీరామ పరిణయోత్సవ
మాహాత్మ్యంజూడఁ దలఁచి యమరులు ముద మే
పారఁగ వెలిఁగించు మతా
బారీలని మింటఁ గుముదబాంధుఁడు వొడమెన్. ౮౮౪

ఉ. ఆసమయంబునన్ మునికులాగ్రణియైన వసిష్ఠుఁ డర్మిలిన్
భాసురతేజుఁ బఙ్క్తిరథు భానుకులాగ్రణిఁ జూచి పల్కె. నో
వాసవతుల్య! పుత్త్రివివాహము లొప్పఁగఁజేయు మిమ్మెడన్
డాసెను భద్రలగ్నమనినన్ మునిపల్కులు వించు నెమ్మితోన్. ౮౮౫

క. మునులున్ భూసురులున్ దన
తనయులు మిత్త్రులు నమాత్యతతులు పురంధ్రీ
జన కవిగాయకభటులున్
దనతోఁ [illegible] ౮౮౬

సీ. వందిమాగధులు కైవారంబులొనరింపఁ
బౌరాంగనలు సేసఁబ్రాలఁ జల్ల
వారాంగనలు నాట్యవైఖరిఁ జెన్నొంద
భూసురాశీర్వచస్స్ఫూర్తు లమర
వేణువీణాశంఖవివిధధ్వనులు గ్రాలఁ
గరదీపికానీకకాంతు లడర
ముందటి కేతెంచి కొందఱు సుందరుల్
హాళిమీఱంగ నివాళు లిడఁగ

గీ. కాహళీభేరికా మృదంగ స్వనములు
మిన్నుముట్టంగ మేడల మెలఁగు రాజ
బింబవదనలు చూచి మోదంబుఁ జెందఁ
జెలఁగి వీథులయందు వేంచేయఁదొడఁగె. ౨౨౭

గీ. బాణకారులు వేడ్కతో బార్లుదీర్చి
పరఁగ లంకాపురుల్ మతాబాలు చిచ్చు
బుడ్లు జువ్వలు గాల్పఁదదుద్భూరి రుచులఁ
బట్టపగలని తోఁచె నప్పట్టునందు. ౨౨౮

క. జువ్వలు గగనంబునకున్
రివ్వునఁ జని యచట విస్ఫులింగచయంబుల్
నివ్వటిలఁ జేయఁగా నవి
యవ్వేళను దార లనఁగ నగపడుచుండెన్. ౨౨౯

గీ. పౌరవీథులయం దిట్లు భద్రవైభ
వంబు దీపింప వేవేగ వచ్చివచ్చి
సకల జనములతో దశస్యందనుండు
జనకభవనంబు దరిఁజేరుసమయమునను. ౨౩౦

ఉ. అంగన లంతరంగములయందు ముదంబుదు పెంపుఁ జెంద సా
రంగగతిప్రచారములు [illegible]

ముంగలి కేఁగుదెంచి తమముద్దుమొగంబులు తేటలూరఁగా
బంగరు పళ్లెరంబులను బట్టిరి చిత్రముగాఁగ నారతుల్. ౮౯౧

ఉ. ఆరతి యిచ్చువేళ నొకయంగన నల్లని కల్వరేకులన్
సారెకుఁ గేరుకన్నులను జక్కని బంగరుపళ్లెరంబుమేల్
తీరు గనంగ నం దమరు దీపము లోచనకాంతియుక్తమై
చారుసురేంద్రనీలమణి చందమునం గనుపట్టు నింతగన్. ౮౯౨

వ. అనంతరంబ. ౮౯౩

గీ. చారుసహకారపల్లవతోరణములఁ
దనరు పందిళ్లు ద్వారముల్ దాఁటి సరగఁ
బ్రకటముక్తాకరంగవల్లికలనొప్పు
గలుగు భవనాంగణమ్ములు గడచి చనుచు. ౮౯౪

క. పరిణయయోగ్య చతుర్మం
దిర మధ్యప్రాంగణంబు దివ్యాభరణాం
బరవనితాతతి నజ్జన
వరుఁడు ప్రవేశించె సపరివారుం డగుచున్. ౮౯౫

వ. అంత. ౮౯౬

క. మునివరుఁ డరుంధతీపతి
యినకులభవులైన మానవేంద్రుల క్రమముల్
ఘనతరతల్లక్షణములు
వినిపించెన్ సకలజనులు వేడుక నొందన్. ౮౯౭

సీ. మానిత గుణుఁడు శతానందుఁ డంతట
జనకభూపాలు వంశక్రమంబు
నెమ్మిఁ జెప్పఁ దలంచి నిమిచక్రవర్తి మొ
దలుగాఁగ నాతని కులమునందుఁ
గలుగు రాజన్యులఁ గ్రమముగాఁ జెప్పుచు
వారి సత్యవినీత్యవార్యశౌర్య

ధైర్యసత్కీర్తి గాంభీర్యాదిగుణములు
చెల్పిన విను వా రనల్పగతిని
గీ. సంతసించుచునుండ నాజనకనృపతి
పెండ్లికొమరులకును దగు పెండ్లికూఁతు
లకును మంగళస్నానములను ఘటింపుఁ
డనుచుఁ బుణ్యాంగనలఁ బల్క వినుచు వేగ. ౮౯౮
సీ. శ్రీకరకలిత చామీకరకంకణ
నాదముల్ చెవుల కానందమొసఁగఁ
జనుదోయి భారంబు సైఁపని సన్నంపుఁ
గౌను లేఁదీగలు కంపమొందఁ
జెలువైన గబ్బిగుబ్బల పైనిఁదీగఁగాఁ
దారహారంబులు తాండవింపఁ
దమ్ములపై మరందము జాలువాఱిన
మాడ్కి మోములను జెమ్మటలు జార
గీ. రాజమండలముఖులు శ్రీరామునకును
వసుమతీజకుఁ దక్కినవారలకును
బరిమళించుచునున్న సంపంగినూనె
తోడఁ దల లంటి రెదల సంతోష మొదవ. ౮౯౯
గీ. పిదపఁ గస్తూరితోడను మెదిచినట్టి
చందనంబును మేనుల యందునలిచి
యలరు పన్నీట జలకంబు లాడఁజేసి
కురుల తడియొత్తి క్రొమ్ముడుల్ గూర్చి మఱియు. ౯౦౦
క. తిలకములు దిద్ది చందన
మలఁది వరాంజనముదీర్చి హాటకరత్నో
జ్జ్వలభూషల నిడి యంబర
ములుగట్టి సుగంధమాల్యములు పై చిరసిన్. ౯౦౧

వ. మఱియును బరిణయసమయోచితాలంకరణంబు లన్నియుం గావించి యమ్మించుబోల్లు పెండ్లి కొడుకులఁ బెండ్లికూఁతులం గై సేసితిమని జనకున కెఱింగించిన, నతండు ముదితుండై శతానందసహితుండగుచు మృగమదగంధబంధురంబును, విమలమౌక్తికరంగవల్లీవిరాజితంబును, సువర్ణ మణిగణ రమణీయ స్తంభాభిరామంబును, భద్రకుంభ శోభితంబును నవ్యభవ్యద్రవ్య భాసురంబును, సమస్తజనపరివృతంబునునగు వివాహ వేదికం గనకాసనంబుల శ్రీరామ లక్ష్మణ భరత శత్రుఘ్నులం గూర్చుండంజేసి యున్న సమయంబున. ౯౦౨

క. ఇదె సుముహూర్తం బిప్పుడె
గదిసెను బరిణయముసేయఁ గావలె ననుచున్
ముదమున నార్యులు దెల్పఁగ
ముదిరధ్వను లట్ల తూర్యముల రొదలొప్పన్. ౯౦౩

క. జనకధరాపతి రాముని
కును మధుపర్కంబు లొసఁగి కోర్కులు మీఱన్
వనజాతములను బోలు న
తనిపదములు గడిగి విమలతరసలిలములన్. ౯౦౪

గీ. కన్యక పాత్రాంతరాళసంకలితములగు
రామపాదోదకములు శిరంబునందుఁ
దాల్చి ధన్యుఁడనైతి నిద్ధాత్రి నంచు
సంతసించుచుఁ బిదప సజ్జనులు పొగడ. ౯౦౫

చ. కనకాంగిన్ హరినీలకుంతల లసత్కంజాతపాణిన్ సులో
చనయుగ్మన్ గజరాజగామిని శరచ్చంద్రాననన్ భూమిజా
తను సీతారమ ధారవోసెఁ దనుమధ్యన్ రాఘవోర్వీశనం
దనచూడామణి రామమూర్తికి సుధాంధస్తుత్యసత్కీర్తికిన్. ౯౦౬

వ. అప్పుడు. ౯౦౭

శా. వారాంభోజముఖుల్ నటింపఁ గవులున్ వర్ణింప గాతల్ మహో
దారుల్ గీతము లుచ్చరింప మునిబృందం బాత్మమోదింపఁగాఁ
బారావారమురీతి వాద్యతతి నిస్సాణంబుఁ బెంపన్ "ధ్రువం
తేరాజావరుణో" యటంచు విబుధుల్ దీవింపఁగన్ సొంపుగన్. ౯౦౮

క. అంగజనిభుఁడగు రాముఁడు
రంగద్గుణశాలి లోకరక్షణమతి సీ
తాంగనకంఠమునం దిడె
మంగళసూత్రంబు ప్రౌఢిమం గళలొప్పన్. ౯౦౯

వ. అయ్యవసరంబున. ౯౧౦

క. అచ్చరలాడిరి పాడిరి
ముచ్చట గంధర్వు లెల్ల మునివరు లెదలన్
జెచ్చెర సంతోషించిరి
హెచ్చుగ నాదిత్యభేరు లెల్లన్ మ్రోసెన్. ౯౧౧

క. క్షితిజాత లక్ష్మి, రాముఁడు
సితకమలాక్షుండు, వీరిచే మాకు మహో
న్నతసౌఖ్య మబ్బు ననుచున్
గుతుకంబునఁ బుష్పవృష్టి గురిసి రమర్త్యుల్ ౯౧౨

వ. అంత. ౯౧౩

సీ. సాధుసన్నుతుఁడైన జనకభూపతి దన
తనుజముఁ దమ్ముని తనయలకును
బరిణయంబులు సేయ భావించి వరులకు
మధుపర్కము లొసంగి మఱియుఁదగిన
సత్కారములు చేసి సరగున నూర్మిళ
సౌమిత్రి కిచ్చెను సంభ్రమమున
మాళవి భరతకుమారుని కర్పించె
శ్రుతకీర్తి నిచ్చె శత్రుఘ్నునకును

గీ. వరుసఁ దత్కన్యకలఁ గొని వారు దమకుఁ
బుడమివేల్పులు దీవన లిడుచునుండ
నిగమవచనోక్తవిధినిఁ గన్నియలమెడలఁ
గలిత మంగళసూత్రముల్ గట్టి రెలమి. ౯౧౪

క. అంతట రాముఁడు సీతా
కాంతయు నొండొరుల మస్తకముల౯ గడు ని
శ్చింతత ముత్తెపుఁదలఁబ్రాల్
వింతగతి౯ బోసి రెల్ల విబుధులుమెచ్చ౯ ౯౧౫

శా. గౌరీపూజ లొనర్చి మానసములన్ గళ్యాణ మర్థించి తి
త్సారానుగ్రహాలబ్ధశోభనము నందంబొప్పఁగాఁ బూనుచు౯
దా రాజిల్లుచు నున్నచంద్రముఖి సీతానామహారాద్యలం
కార న్రాముఁడు సప్తపదములు ద్రొక్కంజేసెనుత్సాహియై. ౯౧౬

క. పూజితచరిత్రయగు ను
ర్వీజాసతిఁగూడి జాతవేదునియందు౯
లాజలహోమము చేసెను
రాజన్మతి రాఘవుండు రహి నవ్వేళ౯ ౯౧౭

క. క్షితిపతిసుతుఁడగు రాముఁడు
ఘృతసమిధాదికమువలనఁ గీలిని సంత
ర్పితుఁ జేసె నిగమవచనో
దితపద్ధతి దప్పకుండఁ దేజం బెసఁగ౯. ౯౧౮

వ. అవ్విధంబున లక్ష్మణభరతశత్రుఘ్నులును, వైవాహిక క్రియాపర
తంత్రులై దమ్ముంజూచుచున్న సకలజనంబులకు నేత్రోత్సవంబు
సంపాదించుచుండి, యిట్లు పాణిగ్రహణోత్సవాసందిత హృదయారవిందు
లగు నలుగురుపెండ్లికొమరులుం బెండ్లికూఁతులును బ్రదక్షిణపూర్వ
కంబుగా వీతిహోత్రున కరుంధతీవసిష్ఠులకుఁ గౌశికాదిమునిజనంబుల
కుం దశరథ[illegible]కంబులకుం

బురంధ్రీమణులకుం గ్రమంబున నమస్కరించి, తదాశీర్వచనంబులం గైకొనుచుఁ దేజరిల్లుచుండె ననంతరంబ. ౯౧౯

సీ. దశరథావనిపతి ధరణీసుపర్వులఁ
గనుఁగొని మోదంబు గడలుకొనఁగ
నమితసంఖ్యల సువర్ణాంబర మాణిక్య
భూషణంబు లొసంగి పొల్పుమీఱఁ
గవిశిఖామణులకు గాయకోత్తములకుఁ
గామితార్థములిడి గారవించి
వందిమాగధులకు వైతాళికులకును
వారకాంతామణీ వర్గములకు
గీ. వలయు నన్ని పదార్థముల్ వరుస నొసఁగి
మఱియుఁ దగువారి కందంద మాన్యలీల
సకలవస్తువు లిచ్చుచు సాధునుతులు
గాంచి వెలయుచునుండె నఖండమహిమ. ౯౨౦

క. సీతాకల్యాణోత్సవ
మీతఱిఁ గనుఁగొనుటచే నహీనప్రమదో
పేతుల మైతి మటంచును
గీతంబులు పాడి రపుడు కిన్నరులు నరుల్. ౯౨౧

గీ. తనయులకుఁ బెండ్లి గావించు దినములందు
జనకభూతలపతి సర్వజనములకును
షడ్రసోపేతములగు భోజనము లిడుచు
దేవమానవవినుతుఁడై దేజరిల్లె ౯౨౨

వ. ఇట్లతిరమణీయంబై పరిణయమహోత్సవంబు ప్రవర్తిల్లుచుండ వాసరచతుష్టయానంతరంబున వజ్రవైదూర్యవిద్రుమనీలగోమేధిక పుష్యరాగపద్మరాగమరకతమౌక్తికరత్నంబులచేత రచియించిన ప్రోలియందు నవ్వధూవరులు ప్రవేశింప నాకబలివిధానంబును యథాక్రమంబున నమ్మొఁ నమ్మనపరంబున ౯౨౩

క. సంచితజనమోదములై
వంచితసురభేరికాంబువహనాదములై
పంచమహావాద్యంబు లు
దంచితగతి వెలయుచుండెఁ దఱుచుగ నచ్చోన్. ౯౨౪

క. కాంతలు సమయోచితగతి
స్వాంతంబుల నంకురించు సంతసములచే
నింతైన శంక లేక వ
సంతంబులు జల్లులాడ సాఁగిరి తమలోన్. ౯౨౫

వ. అప్పుడు రామలక్ష్మణ భరతశత్రుఘ్నులం దత్కళత్రంబులం గాంచి యానందించుచున్న బుధజనులు వారలం గ్రమంబున వర్ణింపఁబూని రెట్లనిన. ౯౨౬

క. కంటిరె రాముని సీతని
వంటి మహాపురుషు ధీరవరు గుణశాలిన్
గంటిమె యెచ్చటనైనన్
వింటిమె పరికింప నితఁడు విష్ణుండుఁగదా ! ౯౨౭

గీ. కుందమందారధవళారవిందబృంద
చందనసుకీర్తి రాజన్యవందనీయుఁ
డిందిరాజాతసుందరుం డిందువదనుఁ
డిందిరాజాతఁగూడి చెలొవ్వొందె నహహ ! ౯౨౮

సీ. నీరజాతాక్షుఁడై నీలధారాధర
శ్యాముఁడై హేమవస్త్రములఁ దనరి
శ్రీగల నామంబుఁజెంది సర్వజ్ఞుఁడై
రాజశేఖరుఁ డనఁ దేజరిల్లి
అజపితామహ వరాఖ్యాశోభియగుచును
సుమతి వాక్పతి యన సొంపు మీఱి
వసుపతియై యగ్రవజహర్షదుఁడై ప్ర
[illegible]

గీ. యున్నసీరాము వర్ణింపఁ బన్నగేంద్ర
ధాతలకునైన వశమానె తథ్యమరయ
హరిహరబ్రహ్మ పంకజాప్తాత్ముఁ డితఁడు
గాకయుండినఁ దత్సమఖ్యాతిఁ గనునె. ౨౯

ఉ. మందరశైలధీరు నసమాన పరాక్రమశాలి మాలికా
చందనభూషణాన్వితు విశాలయశున్ నవహాటకోల్లస
త్సుందరమూర్తి నూత్నపరిశోభితకాంచనవస్త్రయుగ్మునె
న్నందగు వాని లక్ష్మణుఁ గనందగు సీతని నూర్మిళాపతిన్. ౩౦

క. భరతుని ముఖలీలాజిత
భరతుని సుగ్గుణమణీవిభాస్వచ్చరితున్
సరసాగ్రణిఁ గనుఁగొంటిరె
వెరవొప్పఁగ నున్న మాళవీనాయకునిన్. ౩౧

క. అన్నలకడఁ గడుభక్తిని
మన్ననసేయుచును మెలఁగు మాన్యుని నితనిన్
దిన్నగ నవలోకింపరె
సన్నుతు శ్రుతకీర్తివరుని శత్రుఘ్నాఖ్యున్. ౩౨

క. ఇందిర యనఁగాఁ దగు నిం
దిందిరసమవేణి ఘనమతిం జంద్రాస్యన్
కుందరదనాళి లసదర
విందాక్షిన్ సాధ్వి సీత వీక్షించితిదే. ౩౩

గీ. విబుధగణము లెపుడు వినుతింపఁ దగియెడు
మగఁడు గలుగఁగోరి జగతిలోన
విబుధగణము దన్ను వినుతింప మెలఁగు నీ
రామభార్య గాదె రామభార్య. ౩౪

సీ. చక్రవాకద్వంద్వచారుపయోధర

కంబుకంఠి తరంగకమనీయవళి హంస
యాన సత్కోకనదారుణోష్ఠి
సైకతశ్రోణి విసారవిలోచన
చంచరీకాలకజాల రమ్య
భాసురకల్హారపాణి ఫేనస్మిత
మధురామృత విరాజమానవాణి
గీ. గాననిక్కాంత వాహినిగాఁగ నొప్పు
నట్లు గాకున్న నూర్మిళ యనఁగఁదగునె
లక్ష్మణునిపత్ని దీనిసులక్షణముల
వర్ణనముసేయఁ దరమె యెవ్వారికైన. ౧౩౫

క. సిరిగల కన్నులుగలిగిన
తరుణీమణి యిదియగానఁ దథ్యముగాఁగన్
బరఁగెను మాలవినాఁగను
భరతునిసతి జగతి నిట్టి భామిని గలదే. ౧౩౬

క. తనసాటి వారిలోపల
ఘనకీర్తులు గలిగి వెలయు కాంతామణిగా
వును శ్రుతకీర్తి యనంగాఁ
దనరున్ శత్రుఘ్నపత్ని దర్కింపంగన్. ౧౩౭

వ. [illegible] యిట్లనేకు లనేకవిధంబులం బ్రశంసించుచున్నంత సహోదరస
హితుండై జనకమహీశుండు దశరథేశ్వరున కిట్లనియె. ౧౩౮

క. మాకన్నెలఁ గోడండ్రుగఁ
గైకొంటివిగాన మేము కడుధన్యులమై
లోకములో వెలసితిమి ది
వాకరకులజాత నృపతివర్గవతంసా ౧౩౯

వ. అనిన నతం డతని కిట్లనియె. ౧౪౦

గీ. ధర్మగుణశాలి వరకుశధ్వజ వరుండు
తతభుజాటోపజితకుశ ధ్వజవరుండు
జనకుఁడను వార్తనుంచె నిజ్జగతియందు
నీచరిత్రంబు నాకు వర్ణింప నగునె. ౯౪౧

క. నీతనయల నీతనయల
నీతతి నానందనులకు నీ వొసఁగుటచే
నీతివిశారద జనకమ
హీతలవర మత్కులంబు హెచ్చె ధరిత్రిన్ ౯౪౨

వ. అని యగ్గించుచున్న సమయంబునం గౌశికమునీంద్రుండు సంతు ష్టాంతరంగుండై జనకదశరథుల నాశీర్వదించి, వసిష్ఠాదిమహామును లం దక్షినవారల వీడ్కొని హిమశైలంబున కరిగె; నంత మిథిలాధీ శ్వరుండునుం గూఁతులకు నుచితవాక్యంబుల నయవిశేషంబు లుపదే శించి, నూతనదివ్యాంబరాభరణ మణికనకచందనాగరు కస్తూరికాదు లొసంగి రాఘవులకుఁ గరితురగరథపదాతి కనకాంబరాదులు కానుకలిచ్చి మన్నించి దశరథేశ్వరు వీడ్కొల్పిన నతండు పుత్త్రవ ధూమిత్రామాత్య బంధుగణవాహినీ సమేతుండై యయోధ్యాపు రంబునకు నరుదెంచునెడ మార్గంబున, ప్రళయకాల కీలిపగిది దక్షా ధ్వరసమయచండకోపసహిత వీరభద్రుమాడ్కి వెలుఁగు భార్గవరా ము కుఠారచాపబాణధారిఁ గనుచు. ౯౪౩

క. అందఱు డెందములందున్
గొందలపడుచుండ నంత గొబ్బునఁ బజ్క్తి
స్యందనుఁ డెదురేఁగుచు మది
యందున్ గడుభక్తి వెలయ నారామునకున్. ౯౪౪

గీ. అర్ఘ్యపాద్యము లొసఁగిన నాదరింప
కతఁడు రాఘవుచెంతకు నరుగుదెంచి
దీప్తపావకుచందానఁ దేజ మెసఁగ
నిలిచె ... ౯౪౫

వ. అతని తేజోవిశేషంబున కచ్చెరుపడుచుండ రామచంద్రునకుఁ బరశు
రాముం డిట్లనియె, ౫౮౬

ఉ. నీవరవిక్రమంబు విని నెమ్మదిలోన సహింపలేక నీ
లావు గనంగ వచ్చితిని లక్ష్మణుఁ డీవును గూడి చాపవి
ద్యావిదులైతి రంట విబుధస్తుతు లొందితిరంట బల్మిచే
శైవశరాసనంబు లఘుసారముఁ జేసితివంట రెంటుగన్. ౫౮౭

క. విలు విఱుచు మాత్రమున ని
న్నలఘుబలుం డనుచు జనకుఁ డాత్మఁ దలఁచుచున్
లలి నొసఁగె నీకుఁ దనసుత
నలివేణిని సీత నృపతు లవివేకులుగా ౫౮౮

గీ. చివుకు విల్లు విఱిచి సీతను జేకొను
నంతమాత్ర గర్వ మందరాదు
చేవగలుగు నాదుసింగాణి యెక్కిడి
శరముఁగూర్చి గర్వపరుఁడ వగుము. ౫౮౯

క. సీతోడ రణముఁ జేయఁగఁ
జేతోమోదంబుగలిగి చేరితి నిటకున్
నా తెఱఁ గిటు లెఱిఁగించితి
భీతిల్లక నిలిచిపోరు బీర మెలర్పన్. ౫౯౦

క. ముయ్యేడుమార్లు నృపతుల
కయ్యంబులఁ దునిమినట్టి ఘనుఁడను నను నీ
వియ్యెడ నసదుగఁ జూడకు
మయ్యా భృగురాముఁ డనఁగ నమరినవాఁడన్. ౫౯౧

క. రాముఁడన నే నొకండన
భూమీస్థలి వీరులందుఁ బొగడికెఁ గంటిన్
వేమఱు మదన్యవీరుని
రాముని నీమున్ని నెఱుంగ రఘువంశభవా! ౫౯౨

క. అనవుడు దశరథుఁడెంతయు
మనమున బెగడొంది యతని మాన్యచరిత్రున్
ఘనతరకుఠారధారా
వినిహతనృపు రాము నిట్లు వేఁడఁదొడంగెన్. ౯౧౩

ఉ. బాలుఁడు రామచంద్రుఁడు కృపాయుత! క్రొత్తగఁ బెండ్లియైనవాఁ
డీలలితాంగుఁ బ్రోవ నిఁక నెవ్వరు గల్గుదు రీవె కాక ము
న్నాలము చేసి నేరఁడు మహాత్ములజాడ లెఱుంగలేఁడు నీ
జాలఁగ వేఁడుకొందు నను సమ్మతిఁజూచి కుమారుఁ బ్రోవవే. ౯౧౪

క. వరగుణుఁడగు కశ్యపునకు
ధరయెల్ల నొసంగినట్టి దాతవుగానన్
కర మర్థి నిన్ను వేఁడెదఁ
జిరపుణ్యా యోగివీరశేఖరగణ్యా ౯౧౫

క. శ్రుతులన్ని చదివి తద్ధిత
మతి విజితేంద్రియుఁడ వగుచు మౌనివరుఁడవై
సతతము సన్నుతిఁ గనునీ
కతికోపము దగునె యిటు లహఃపతితేజా! ౯౧౬

గీ. అనుచుఁ బ్రార్థింప సమ్మాట లాదరింప
కపుడు జమదగ్నిమునిసుతుం డధికరౌద్ర
రసము దీపించుచుండఁగా రామభద్రు
సుజనరక్షావినిద్రుని జూచి పలికె. ౯౧౭

గీ. నాకు గురుఁడైనయట్టి పినాకిధనువు
విఱిచినాఁడవుగాన నివ్వేళ నిన్ను
నిగ్రహించెద నిఁక రా దనుగ్రహంబు
కోరి భీతిని [illegible] ౯౧౮

గీ. రాజశబ్దంబు మత్కర్ణరంధ్రమునను
బడిన ఘృతదీప్తిఁ బావకుభంగి రోష
మడరు రాజవు రాముఁడవైన నిన్నుఁ
గాంచి యూఱక యెట్లు సహించియుందు ౯౫౯

వ. అదిగావున. ౯౬౦

క. అండజపతిగమను ధను
ర్దండము మత్కరమునందుఁ దనరుచునుండన్
దండములు మాని యిదె కో
దండముఁగొని బల్మిఁజూపు దశరథపుత్రా! ౯౬౧

చ. అనుడు విభాకరాన్వయమహాంబుధిసోముఁడు రాఘవుండు పా
వనచరితుండు దివ్యమునివంద్యుఁడు భార్గవు బల్కె నీవు నే
ముని వని పెద్దవాఁడవని మ్రొక్కితిఁగాని ధనుర్ధరుండనై
యని యొనరింపలే కెద భయంపడి కాదు కృతాత్మభూసురా! ౯౬౨

వ. అనిపల్కి తదవసరంబున. ౯౬౩

ఉ. వాసవవిక్రముండు రఘువర్యుఁడు భార్గవరాము వేఁడి బా
ణాసన మందికొంచు రయమారఁగ సజ్యముచేసి బంధురో
ల్లాసముతోడ మాఱ్వఁగొని లాఘవమొప్పఁగఁ గర్ణమాద రాఁ
దీసి గుణధ్వనుల్ సలిపి దివ్యశరంబు నమర్చి లీలతోన్. ౯౬౪

క. నాశిఖ మమోఘం బిది
గావున నీపాదయుగము ఖండింపుదు భూ
దేవా భార్గవ! యనినన్
దా విని భృగురాముఁ డెదను దల్లడపడుచున్. ౯౬౫

క. బలతేజోరహితుండై
చల ముడిగిన మతిని రామచంద్రునితోడన్
బలికెను మృదుతరభాషణ
ముల సాత్త్వికవృత్తి నిక్కముగఁ దోఁపగన్. ౯౬౬

సీ. రామ రాఘవ పాండురాజీవలోచన
రాజవందిత పదాంభోజయుగళ
తాటకాంతక బాణదళితనిశాచర
శరదిందుచంద్రికాచారు కీర్తి
కౌశికయాగరక్షాదక్ష యాత్మ ద
ర్శనపవిత్రీకృతమునికళత్ర
వర్షావసర వారివాహసన్నిభగాత్ర
సారసమిత్ర లసత్ప్రతాప
గీ. దశరథావనిపాలనందన మహాత్మ
పాలితాఖిలలోక కృపాసముద్ర
భూసురావననిరత సీతాసమేత
నిన్ను నుతిసేయ నేర్తునే నిగమవినుత. ౯౬౭
గీ. జానకీనాథ నీవు నిశ్చయముగాఁగ
మనుజరూపముఁ గనినట్టి మాధవుఁడవు
గాకయుండిన నాచేతికార్ముకంబు
నెక్కువెట్టంగ శక్యమే యేరికైన. ౯౬౮
క. నీకును నాకును భేదము
లేకుండఁగ నిట్లు కుండలిశయాంశముచే
లోకమునఁ బుట్టినారము
వైకుంఠునిమహిమ నెన్నవశమే విధికిన్. ౯౬౯
క. నిన్నొకటి వేఁడుకొనిమొదఁ
గ్రన్నన నామనవి నీవు గైకొనవలయున్
సన్నుతగుణ మణిభూషణ
యన్నాయని పొగడి మఱియు నతఁడిట్లనియెన్. ౯౭౦
గీ. తొలుతఁ గశ్యపునకు నిలయెల్ల నొసఁగితి
నవని పరిచి ...

డాన మనములో ముదంబొప్పఁగ మహేంద్ర
నగనివాసినైతి నాఁటఁగోలె. ౯౭౧

వ. అదిగావున. ౯౭౨

సీ. ప్రతిదినంబు మహేంద్రపర్వతంబునకు సా
యంకాలమునకు నే నరుగవలయుఁ
గాన నాపాదయుగంబు దున్మాడక
కరుణింపవలయు నీ వురుబలాఢ్య
రాఘవ నీదు శరం బమోఘముగాన
సరగున మత్పుణ్యసంచయంబు
విదళింపు మనిపల్క వినుచు నారఘురాముఁ
డతఁడు గోరిన యట్టులాచరింపఁ

గీ. బరమసంతోషకలితుఁడై భార్గవుండు
రామచంద్రునివలనఁగాని రయముతోడ
దశరథేశ్వరు చెలిమి నొందఁగ నతించి
వినయరీతి నిజస్థానమునకుఁ జనియె. ౯౭౩

వ అంతకుమున్న మహావీరులగు రఘురామ భృగురాముల పరాక్రమంబు లరయుటకు నరుగుదెంచియున్న పంకజాసనపాకశాసనప్రముఖ బృందారకులును గరుడగంధర్వ కిన్నరకింపురుష యక్షరక్షస్సిద్ధచారణాదిదేవయోనులును బహువిధంబులగు సాధువాదంబుల నారామభద్రుం బ్రశంసించి కుసుమవర్షంబులుగురియించి, యంతర్ధానంబు నొంది రనంతరంబ. ౯౭౪

క. తనతనయు విక్రమమునకు
మనమున మోదించిగుణసమంచితుఁ డజనం
దనుఁడు సపరివారుండై
చనుదెంచె నయోధ్యకడకు సమ్ముదలొప్పఁగ. ౯౭౫

గీ. ఇట్లువచ్చిన నవ్వార్త యెఱిఁగి పౌరు
లెలమి నెదురేఁగి బహువిధంబుల నుతించి
తోడుకొని రాఁగ నాతండు వేడుకలరఁ
బురముఁ జొచ్చెను నవపురందరుఁ డనంగ ౯౭౬

వ. ఇట్లు పురంబుఁ బ్రవేశించి ౯౭౭

క. రాజీవముఖులు వెస నీ
రాజనము లొసంగ వందిరాజి నుతింపన్
రాజిత గణికాజనమణి
రాజిలు నటియింపఁ దూర్యరవము లుచెలఁగన్. ౯౭౮

మ. జగతీనాయకుఁ డాత్మమందిరము నిచ్చం జొచ్చె నవ్వేళఁ ద
న్మృగనేత్రల్ సకళత్రులైన సుతులన్ వీక్షింప నేతెంచిరన్
నగవుల్ మోముల నంకురింపఁగ మహానందాప్తులై వారలన్
దగఁ గౌసల్యకుఁ గైకకున్ వరసుమిత్రాదేవికిన్ మ్రొక్కినన్. ౯౭౯

గీ. పుడమితేని సతులు కొడుకులఁ గోడండ్రఁ
గాంచి ప్రేమరసము లంచితముగ
మించియుండఁ గౌఁగిలించుచు దీవించి
సంతసించి రాత్మసరసిజముల. ౯౮౦

వ. తదనంతరంబ. ౯౮౧

చ. సతులు తనూజులున్ దనయజాయలు నాత్మల మోదమందఁగా
సతతము శోభనంబుల నిశాంతము శోభిలుచుండఁగాఁ బురో
హితులు నుబంధువుల్ హితులు హెచ్చుగ మెచ్చఁగ మంత్రివర్గముల్
క్షితితల మెల్ల నేలె నృపశేఖరుఁ డెంతయు నీతిచాతురిన్. ౯౮౨

క. అనిచెప్పిన విని పుట్టం
జనిట్టుంచిన యట్టివాని సరసిజభవనం
దనుఁగని యవ్వలికథ నా
కనఘా! కృపతోడఁ జెప్పుమని పల్కుటయున్. ౯౮౩

గర్భస్రగ్విణీభుజంగ ప్రయాతద్రుత విలంబిత వృత్తసీసము:—

ఈశానభూధరా ధీశ్వగోదూ్భత దా
రాన్వితాశాకుంజరాస్యజనక
ధీశాలి మాధరీత్రీశసన్మానిత
ప్రాభవాఢ్యా భర్గభావజారి
యవిరళదోర్ధర ణ్యాదికాస్తోకత
స్వష్టకార్యావసిష్ఠాదివినుత
యగచాపగోధురి స్థారి రాఘోర దో
ర్గర్వహారీశరత్కంధరాభ
శివమహేశ్వర శ్రీగళ చిన్మయాత్మ
భువనరక్షణ భోగివిభూషణాళి
దివిజవంద్య నదీధర దీనపాల
భవలసన్మృదుభాషణ భద్రదాత. ౯౬౪

సగర్భ మత్త కందసీసము:—

విజితనాగాసుర వీరపంచముఖ భ
స్మీభూత పుష్పాయుధాధవాఖ్య
మహిత నారాయణ మార్గణా యనఘస
ర్వేషాగిరీశా శివా శరణ్య
వితతకారుణ్య సువిక్రమానిటలనే
త్రాపన్నగేడ్భూషణా పురారి
సుకృతి సంసృత్యవిశుద్ధమాసపినాకి
పార్వతీవల్లభా—పరార్థ్య
హర కువలయాప్తశేఖర సరసిజభవ
హరిహయాద్యజరవరవంద్యా సురుచిర
గురుతరయశ శుభకర సుచరితసకల
వరద కరిముఖజనకా దివాకరాభ. ౯౬౫

కందమణి గణనికరము:—

సురనుత పురహర సురుచిర
కరుణాకర కరతలధృతఘనతరహరిణా
చిరతర గురుయశశ్శీతిధర
శరణాగరస హృదయ కవిజన నతచరణా! ౧౮౬

గద్యః—ఇతి శ్రీమదుమామహేశ్వర కరుణాకటాక్షసంలబ్ధసరస కవితాధారాసుధారసపాత్ర హరితసగోత్ర పవిత్రాపస్తంబసూత్రవినుత బుధసమాజ మంత్రిప్రగడ వంశరత్నాకర ద్విజరాజ శరభరాజామాత్యపుత్ర వివిధ విద్వజ్జనవిధేయ సూర్యప్రకాశ నామధేయ ప్రణీతంబైన సీతారామ చరిత్రంబను మహా ప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ భీమలింగేశ్వరార్పణమస్తు.

---

